# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఆగస్టు 1958

సంపుటము ౩౫ : : సంచిక ౮

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1958

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణారావు

* గతపంచిక తరవాయి *

మృగముల్ నాగము నావలెన్ భవమునం దెంతేనియున్ జిక్కి తా
మొగచాట్లం బడ, నన్ను మాని మఱి యీ యన్నింటి విప్పించి వా
వు గదా! నన్విడిపింప కుండుటది బాబూ! నీదు డెందమ్ముఁ బి
ట్టగలింపం జనదే? యదేమి కత మప్పా! పక్షపాతావకున్?

ఏగతిలేని యార్తులకు నీవ శరణ్యము పాపహారి! యం
చాగమ తత్త్వముల్ దెలుప, నట్టిఁడ వీవని నిశ్చయించి నే
నేగి సమస్త పుణ్యముల హేళనముం బొనరించినాఁడ, నీ
లాగున నంబుజేక్షణ! తలంప వొకింత యదేల చెప్పుమా!

పతితులఁ బ్రోవఁగాఁ గలుగు పావనమూర్తివి నీవయంచు నే
నతగము వేదశాస్త్రములు సల్పెడుమోవను బాగవింట, దు
ష్కృతములచే యుపాసనము సేసితి నోవరదా! యశేష దు
ర్గతులకు నీవ సద్గతివిగా మదిఁ గట్టిగ నమ్మి శ్రీపతీ!

మును సుకృతంబులన్ బొఱిచిపోయియు సేయవలేద మెన్నఁడున్,
విను మఖిలమ్ము దుష్కృతము వేమరు సేసితి, నీదు ముందటన్
గొన కిపు డేమి పల్కవలె కొంకును జంకును ఏడి? సిగ్గు యె
గ్గనునది లేదుగాని యొక యంతయు గర్వము లేదు శ్రీహరీ!

మదమును గామమోహములు మత్సరమున్ బలమెల్ల మొత్తి నీ
యెదుటన శత్రువుల్ గదిసి యింతగ నన్నిటు లేడిపింపఁగా
వదిర! గదారి నందకము లావయు శార్ఙ్గము చేతఁబట్టియున్
గదలవు సిగ్గు సెందవు కవన్ నను గాదని యుందువేలరా?

గోతను బడ్డబిడ్డఁ గని కొండొక దారిని బోవువాఁడునున్
బ్రీతిని జాగుసేయకయ పేరిమితో దుత నుద్ధరించెడిన్,
త్రాతవు నీవు నో జనక! దారి భవాంబుధి దూకుచున్న యీ
లేత వయస్సువాని గని లీలగఁ జూచుచు నూరకుందువే.

* జగన్నాథ పండితరాయల కృతికి అనుకృతి

వరపుణ్యప్రియ! పుణ్యవంతులకు సర్వశ్రేయముల్ గూర్తువన్
బిరుదట్లుండఁగనిమ్ము; పాపినగు నన్ వేఁ బ్రోవరానేని యా
ధర విశ్వంభరుఁడన్న పేర్మి నిలువ దంగన్ గాచి కావిమ్మవు, ఎ
వ్వరు గాదన్నను నీవు గాదనక నన్ బాలింపు లక్ష్మీప్రియా!

పరుషము లెన్నిరో యకట! పల్కుచునుంటి నటంచు రోసమున్
విరసముఁ బూనకయ్య, యొకవేళ రుషాత్ముఁడవైన దోసమున్
మురహర! కోటికల్మష విమోహితునిన్ మఱి పావదూరకు ని
ర్భర కరుణాబ్ధిలో విసరివైవు, జగద్భరమింక తప్పెడిన్

కృతము గణించి నాకవల నెల్లసుఖమ్ము లనుగ్రహింతొ యా
శ్రితుఁడను నే గ్రహింపనవి చిన్నము పున్నము నేసియుంటమిన్,
పతితుల నుద్ధరించుట స్వభావము నాకని యేలుదేవి శ్రీ
పతి! తలఁదాల్తు నీదయ యవశ్యముఁ దుష్టియుఁ బుష్టి సెందెదన్

పతితుఁడనైన దుఃఖముల పాలగువాడనునైన నెంతొ దు
ర్మతియుఁ గృతఘ్నుఁడే యయిన మంచితనమ్మనుమాట లేకయే
బ్రతికిననైన సిగ్గువడి ప్రాంజలినై భవదీయుఁడన్న న
ప్రతిహత మీకు! నీదయకుఁ బాత్రుడగున్ గద యా యపాత్రుఁడున్!

చతురతఁ బుణ్యమే సలుపు సాధులపైఁ గృపఁ గుమ్మరింతు వా
ప్రతిఫలమేమి నీకటఁ గృపానిధి! యీ ననుబోటివానిపై
సతత కృపాకటాక్షముల చాల్కఁగఁ జేసిన నాడు నీదు కీ
రితి యది యేమి వేసము ధరించునో నీవ గ్రహింపు మాధవా!

మును పొకనాడు లాలనము పొందిన బిడ్డఁడు తండ్రిచేత నీ
డున, మఱి బుద్ధి నేర్వఁగ గడుంగడుఁ దాడితుఁడౌటయుక్త, మా
లనయును పాలనన్ దెలియ లాలన నీయెడ నే నెఱుంగ, ప్రా
క్తన నిజ పాపకర్మమునఁ దన్నులు తింట యొకండు దక్కరా!

"భగవన్!" నే బహుదోషదూషితుఁడనై పాపౌఘముల్ ముంగగా,
వగలన్ మున్గుచు నేమి తోచక వృథావాగ్ధోరణిన్ దిట్టితిన్
జగతిన్ బాంధుఁడు ప్రేయసీ విరహజ జ్వాలాగ్ని సంతప్తుఁడై
వగతో నయ్యయ్యొ కాంతుఁడిట్టనుగదా! భద్రాను సంధాయకా!

## క రు ణా ల హ రి

ఓ కరుణానిధీ ! మిగుల నుద్ధతిమై దహియించె దుర్దశా
వ్యాకులుఁ బాప పంజరుని బట్టిక కీలిచి పిప్పిసేసిన
ప్పా ! కను వేదిమో జ్వర మపారకృపామృతసాగరా ! నరుం
జేకొని పీడకున్నది యికీ ! ఋణమేని యిఁక కేమి సేయుదున్.

అల్పుఁడనై కటాక్షముల నిరంతర జప్యనముం బొనర్ప నం
కల్పితమాన నాదుపయి కారణికోత్తమ ! నీకుఁ గ్రోధ మ
త్యల్పముగాదో ! గనింత్రె కుపితాతుర బాలక భాషితమ్ములం
దెల్ప ! మహానుభావులు సుధీ నిధు, లాశ్రిత లోకపాలకా !

ఉరగారాతి సుకేతనా ! కనుమదో ! యుత్తంభితాశాసము
త్కర మోరాహముల జట్టికొంటి, జటిలో దగ్రజ్వరోన్మత్తకుం
జరవ్రాంకుశ, నన్ మహాజ్వరశిఖజ్వాలావళీధుర్వ నిరా
దరతన్ పీడకు గ్రముక్కుకొందును మహాధన్వంతరీ ! శ్రీహరీ !

ఏనన దుష్కృతమ్ము లవి యెన్నఁడు సేయన లేదటంచు, నో
దానవ వైరి ! పల్కెద యథామతి నొక్క నిజ, మ్మదేమనగ
మానసమందు భీతి ననుమానముఁ బాపె ఖగేంద్రయాన ! నీ
యాన, సుధానిధాన, పతితావన పావక నామగానముల్

శర్వ పితామహాదులును సర్వ సుపర్వనిశాచరావళుల్
నిర్వచనమ్ము సేకయు నిన్ బొగడోత్రముఁ డంచుఁ గొల్వ నిన్
గర్వ ముఖర్వ మూని యిటు గంటె యుపాలభమానవాక్కులన్
జెర్వడు పీడిచీ ! ఖలుఁడు ఛీ! కను ఛీ ! యిదె పాడు బుద్ధియుం.

సకలమ్ముల్ విసనాడినాఁడ, మఱి నా సర్వస్వముల్ నీవ, ని
న్నిఁక నే కోరికయేనికోర నిదిగో యూ కొంచె మర్థింతు, ని
యకలం కాద్భుత మెల్లయందముల కాహా యందమే మూర్తి మా
మక హృన్మందిర గోచరమ్ముగుత, శ్రీమందార మాలాధరా !

స శే షం

# హరవిలాసము: దేవదారు వనవిహారము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడు. కర్పూర పాదలబ్ధ వాణీ ప్రసాదమునఁ బరమేశ్వరు నారాధించినవాఁడు. సంస్కృత కవులలోఁ గవితా గుణోపహారములఁ బార్వతీ పరమేశ్వరుల నారాధించినవాఁడు కాళిదాసు. అతని యడుగుజాడలలో నడచినవాఁడు శ్రీనాథుఁడు. వివిధ రసభావములను బరమేశ్వరాలంబనముగఁ జిత్రించుటలోఁ జెక్కు విషయములం దిరువురకును సామ్యము గానవచ్చును. శ్రీనాథుఁడు తాను సంతరించిన హరవిలాసములోఁ ద్వితీయ చతుర్థాశ్వాసములందు కుమార సంభవ కావ్యానుసరణము గావించుట యెందరికో విదితము. కుమార సంభవ కావ్యమునం దష్టమ సర్గలోఁ బార్వతీ పరమేశ్వరాలంబన శృంగార రస భావములు పరాకాష్ఠనందింపఁబడినవి. హరవిలాసమున పార్వతీ పరమేశ్వర వివాహము వఱకు కుమారసంభవమునందలి కథావస్తువు నాదరించి, పిమ్మట శృంగార రస సమగ్రత నాపాదించుటకై శివ పురాణమునందలి దేవదారు వనవిహార కథావస్తువు గైకొనినాఁడు శ్రీనాథుఁడు.

శైవ కవులు శివుని విలాసములలో దేవదారు వన విహారమును ప్రథమముగ గణించి, తద్వ్యాజమున శృంగార రసభావములను బరమేశ్వరాలంబనముగ నతిమాత్రము చిత్రించుట యొక పరిపాటి. ఆ ప్రక్రియ మునఁ బరమ శివభక్తుఁడైన శ్రీనాథుఁడు దేవదారు వన విహార కథావస్తువును దన హరవిలాస కావ్యోపసంహారకముగఁ గైకొనియు శృంగార రసభావముల నతిమాత్రముగఁ జిత్రింపఁదలఁచియు నౌచిత్యగుణమునకు రస పోషణమునకు సారస్యమునకు భక్తి భావావిష్కృతికి లోప మేపాటియును రాకుండ నిర్వహించియున్నాఁడు. ఈ దేవదారు వనవిహారము సంస్కృతమున ఉత్ప్రేక్షా వల్లభుఁడను కవి రచించిన భిక్షాటన కావ్యమునందును, తదితర శైవకవుల కృతులందును గానవచ్చును. కాని యా రచనలన్నియు శృంగారరస నిర్వాహణమున నుచ్ఛృంఖలములై నడచినవియే. శ్రీనాథునకు సమ కాలికుఁడగు నిశ్శంక కొమ్మనామాత్యుఁడు, ఈతని కాశీఖండ కృతి భర్తయగు వీరభద్రారెడ్డి సోదరుఁడు దొడ్డారెడ్డికిఁ గృతిగా నొసఁగిన శివలీలా విలాసము నందును దేవదారు వన విహారమును జిత్రించియే యున్నాఁడు. అదియు శృంగార రస భావావిష్కరణమున నుచ్ఛృంఖలమై కొనసాగినది.

శ్రీనాథుఁ డీయితివృత్తముఁ జేఁబట్టి నద్వైతీయము సంతరించుకొనుచు రస నిర్వహణమునఁ బ్రతిభానము సంయమనము నలవరించుకొని, శృంగార రసమును భక్తితో మేళవించి చరమసీమకుఁ గొనిపోయినాఁడు. ఆ విషయము నిట నా యూహకొలఁది వివరించెదను. పరమేశ్వరుఁడు పార్వతిని బెండ్లియాడి, మన్మథుని పునరుజ్జీవితునిఁ జేసి, పారిషదగణము తిమ్మ భజించుచుండ రజతనగమున సకల కుటుంబభార సహిష్ణుఁడై సంసారసుఖ మనుభవించుచుండెను. పార్వతి మీఁది వలపుచేఁ ద్రిలోకాధీశ్వరుఁడైనను హిమవంతు నింట నిల్లఱికముండెను. ఏనాఁడైన నత్తవారియింట నిల్లటముండిన యల్లునిపై నత్తవారి కనాదర భావ మేర్పడకమానదు. ఈశ్వరునకునైన నట్టిది తటస్థించె నని తెలుపుదు—

> "అత్తపైఁ గూర్మి పుట్టెనో! యత్తయింట
> నిల్లఱంబుండెఁ ద్రిభువనాధీశ్వరుండు."

అనినాఁడు. త్రిలోకాధిపతియైనను భార్యమీఁది వలపుచే నత్తవారింట నిల్లటముండుట యనివార్యమని వ్యంగ్య ధ్వనితము.

ఇప్పటి యీశ్వర వేషము శ్వశుర గృహనివాస యోగ్యమైనాలంకార పరిశోభితము. ఇంతకుముందు నాగయజ్ఞోపవీతధారి యిప్పుడు బంగారు జన్నిదములు ధరించుచున్నాఁడు. యోగీంద్రుఁడిపుడు గజాసురచర్మము విడి పట్టుపచ్చడములు దాల్చుచున్నాఁడు. భస్మాంగ రాగము విసర్జించి కస్తూరితో మేళవించిన శ్రీగంధ మలఁదుచున్నాఁడు. ఎముకల పేరులు వదలి ముత్యాల హారములు ధరించుచున్నాఁడు. జడలపైఁ బాగడ చాళ్ళు ధరించి బాలచంద్రు నవతంసముగఁ దాల్చుచున్నాఁడు. ఇట్లు చంద్రశేఖరుఁడు పెండ్లికొడుకు

కలితమైన నేరము దాల్చి హిమవంతునింట మనువు గనుచుచుండెనట. శివుని సెంట్రీగాఁడుగఁ జిత్రించుట శ్రీనాథున కొక వినోదము.

వాఁడు ఠీవిగా దివ్యవేషధారియై తన వాహనమగు వృషభమును వాహ్యాళికి వదలినట్లు అశ్వముల నధిరోహించి, ప్రమథగణములు వెంటరాఁగ నోషధిప్రస్థపురవీథులలో విహరింపఁ దొడఁగెను. తమ ప్రభు వీథుల మహానిధివాటిలో భిక్షుఁడై, యోషధిప్రస్థమున విహరించుచుండ, వారి యనుచరులు వీట పెద్ద తెగువలేక యువతీతతి చేష్టలు సేయఁగడఁగిరి. వేశవాటమున స్వేచ్ఛాచారముఁ జరింపఁ దొడఁగి, విద్యాధర గంధర్వాప్సరో గణము భామినీ విటాలను బహుధంగుల బాధింపఁ దొడఁగిరి

సీ. పులి కౌపీనములఁ గట్టుకొని బాలఁగని
విద్యాధరాంగనా విటగణంబు
గంధర్వ కామినీ కాముక వ్రాతంబు
లాకోఁకఁ గోవిదాడి లజ్జఁగొంచు
కకపాల వలిమాఁదిఁ గన్నులలోఁ బ్రాము
బాధింతు రప్సరః పల్లవులను
గరుడ భామా భుజంగ ప్రతాపముఁబట్టి
బాధింతు రురగనాగ పట్టికముల
నాగడీలు మహాధూర్తులగచుఁ గాకు
లంద్దిరులు గొంల్లు పలుగాకు లుదుగ మిసుకు
లాకొయలు కిలు గయ్యాళులను
నోషధిప్రస్థ మిల్లిల్లు నుసుకుచుండె

—హర 5-10

తన యల్లుని పరివార మోషధిప్రస్థపురంబున నుపద్రవంబులు సేయుచుండ హిమవంతుఁ డది యంతయు నెఱింగి, మేనాదేవియు దానును మంతనం బుండి, యోర్వఁజాలని డి పాత్రింతియు చాలునని, తన కూఁతు రాలించి, ప్రమథ గణముల ధూర్తముల సేవా చనములు మున్నుగు ధూర్తగణములను నీవుగదా దాదరించుచు నీ భర్త యగు గాకింకరుఁడు వారి ధూర్తచేష్టితములు చూచుచుండవా? అనుంగల్లౌ కౌరవేఁడై బ్రహ్మకపాలము చేతఁబట్టి వావివావెల భిక్షమెత్తిన మాను గాక యిట్టి దివ్యాత్ములు లాతివి గాడించుచు నిన్నుని హిమవంతుఁ డా యాదిభిక్షుని స్వరూపమును వికృతముగా నిరూపించెనట.

సీ. తలమీఁది చదలేటి దరిమీలఁ దివఁజేసు
కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ
మెడఁ దమ్మిపురుగుల మెకు పేగు లొండొంటిఁ
బోరిఁ బోరిఁ దాఁకి బొబ్బలుఁగ రనఁగఁ
గట్టిన పులితోలు కడకోఁకు వోఁకఁ గూఁక
బోతు క్రుత్తిని చిఱ్ఱుబుఱ్ఱు మనఁగఁ
గడిఁ జెంపఁ బాములు కపాలలో నున్న
భూతి మీఁద బలికిన బుస్సు రనఁగ
తమ్మిపూఁజూలి పునుకకందమ్ముఁ జూచి
దిట్టతనమున విగ్రహము కోహో యనుచు
వావివావెల భిక్షించు మాను గాని
యిట్టి దివ్యాన్నములఁ జెమ్ము నే భుజింతు?

—హర 5-16

ఈ పద్యమున శివుని భిక్షాటన స్వరూప మభివర్ణితమైనది. దారుకావన విహారమున కీ భిక్షుక రూపమును భిక్షమూర్తిమయగను, ప్రధాన రస నిర్వహణ సాధనముగను చిత్రించియున్నాఁడు. హిమవంతు డిట్టి యీశ్వర రూపమును మంగళాకారముగా నిరూపించి, యీతని నవమానింపఁ గడఁగుటయే పరమేశ్వరుని దేవదారువన ప్రయాణమునకు నిదానమై జంగమభిక్షుక వేషధారణమునకుఁ గారణమైనది. మరల నా జంగమభిక్షుక వేషధారణము మునిపత్నీ వ్యామోహకమై శివుని యాదిభిక్షుక స్వరూప విష్కృతికి మూలమైనది. ఇట్లీ యితివృత్తమున శ్రీనాథుఁడు పలార్చిన త్రివిధ భిక్షుక స్వరూపములకుఁ గార్యకారణభావము సమన్వితమైనది. హిమవంతుఁడు తన కూఁతుతో నిట్లనుట, పార్వతీ భిమానముఁ లిగి, నీ మొ తనభర్తను ప్రమథగణ దుష్ప్రవృత్తి నివృత్తికిఁ గడఁగవలెఁ జేయుటకై హిమవంతుఁడీ పలుకులు తన పుత్రితోఁ బలుకు నవసరమున నీ యాఖ్యలలో శివ్వఁడు నిత్య గుణుఁడు మాను మనస్సునోని విసుగును, జారగణములకుఁ గలుగు బేపటము, ప్రమథగణముల పేయు ధూర్తకృత్యములను నెఱిఁగి వెంట నీ దేవదారువనమునకుఁ బోఁదలఁచెను. తలఁచిన వెంటనే పరమేశ్వరుఁడు నందివాహనారూఢుఁడు కతిపయ ప్రమథగణ పరివార పరివృతుఁడుమై మామకు తెలిసింపక గౌరితోఁ జెప్పక దేవదారువనమునఁ బ్రవేశించెను.

శివలీలా విలాసమునందలి దేవదారువనవిహార కథివృత్తము శివభక్తి కౌశల్య సముద్భాసకము. ఈశ్వర

వసిష్ఠపౌత్రుని దృష్టి ప్రియత్వంబును, శాక్యాచార్య భార్యయగు శారదాదేవియందు దారకరాజు వలపు చీటంబు వాటంబు సేయు లలితకటాక్షవిక్షేపమ్ములును, ప్రతిమాలి మాలినది సైకతంబున కేళిగృహంబులెం బొదలు కురువింద పాదలలో వేలుపులంబును కెంజిగురుం జెదరి దరిచూచి చొక్కిన పుళిక నందను రాగాకేళింబును, కుసుమ కోదండుని విజయ డిండిమంబగు విభాండకసుతుని వనితామండలాన క్తియు, బృందావనంబునంగు ముకుందుం డొనరించిన సంద్రవణ కథా విహారాడంబరంబును నంబుగహు నూతి గృతి చెడియూడు పట్టించబ్బి కొనిన దోసంబు పట్టనుం బుక హారాళుంబు గౌరిము కళత్రంబు మీఁదం గల్పించిన చీకటితప్పుచుం దాపఁదాపయుఁ జిత్రింబుల్ వ్యగ్రగ్రావపంబు”

ఏకచిత్రోన్మీలిత వస్తుపర్వతము మన్మథ విశాశోద్బోధకము ఇవియన్నియుఁ బురాణప్రసిద్ధములైనవి కేతరగనికృతి సంపాదకరూపములు ఇట్టివిచిత్రాశ్రమవాసి తపోనిష్ఠుల నిష్ఠాభంగమునకై చిత్రింపఁ బడెను. ఇటుల చిత్రాస్థానంబుల నివసించు సప్తర్షిగణవలను త్రిభువన వశీకరణసౌభాగ్య విభ్రమ వ్యాపారాలాపాది భూషితలఁగాఁ జిత్రించినాఁడు

ఇట్లు వసించియుండు నచ్చెడియుండిలో "వివిధమత్తకాశినీ జనోత్తమయగు తిలోత్తమయు, వశీకృత కుసుమశర దయగు ప్రమ్లోచయు, జలజాంబర నఖరేఖాంకిత స్తనకుంభయగు రంభయు, ఘృతాచీయగు సుకేశియుఁ, గలమంజుఘోషయగు మంజుఘోషయు, శృంగార వారాశియగు నూర్వశియు, రూపామరూప స్థానికయగు మేనకయు, దివ్యాగారోహాలు అలంపోక కలికామాపుల, హేలాసందర్శిత మేఖలా కలాపంబులగు విభ్రమ వ్యాపారంబుల, పాటకకులాకోటి ఝుకఝుకి తక్కురమంజరంబులకు సంపగమనంబుల, వికస్వరకపోల ఫలకంబులకు మొలకనవ్వుల, సమ్మతరసరూపంబులగు శాలాపంబులఁ, త్రిభువనంబులు వశీకరింతురంట వివిధమత్తకాశినీజనోత్తంసంబుల సౌందర్యంబు సహాకర్షకములటంచే గాక, వారలమాపులు మందగమనములు మందహాసములు మధురాలాపములు త్రిభువనమోహన సాధనములని చిత్రించియున్నాఁడు ఇంతటి సంమోహన సామగ్రియుండినను వికృతినందని యట్టి వితరాగుల చిత్తవృత్తులనియు, అట్టి దేవదారు వనమున మదనవికారము నావిర్భవింపఁజేయఁబూనుకొనిన పరమేశ్వర సౌందర్యమహా శీతమని నిరూపింపఁదలఁచి త్రిభువన మోహన స్వరూపవతులయిన యప్సరోంగనల ప్రేరణ శివునిచే భిక్షాటన ప్రవృత్తి నుపక్రమింపఁ జేసినాఁడు

అట్టి దేవదారువనమునం దీక్షగుఁడు తన పరివారమునంతయు విటవటమునంపనిచ్చుమించి

సీ. పసిఁడి కప్పెరలాఁతొపుఁ బద్మకోల
తోగ పటీయ కకపాల కోలెంచి
కలిక కాటుక గిర్వాప్పు పలుఁగుపేరు
జాతిగాఁ దాల్చి పొలయింప జంగమకుమ.

—5-41.

ఈ జంగమరూపచిత్రణములో శ్రీనాథుని నాఁటి జంగమ భిక్షుకస్వరూపము ప్రతిఫలించుచున్నది ఇట్టి జంగమరూపముదాల్చి ప్రాతేయాద్రిఁదల కన్యకాధిపతి దేవదారు వనమున భిక్షాటనమునకై బయలుదేఱి, తొలుత సప్తర్షి వాటమునఁ జరింప మొదలిడెఁను అందటి యప్సరలందఱు వింతయాహార్యరముల మొలకెత్త నా జంగమ భిక్షువునకు భిక్షాన్నములిడ దొరకొనిరి. ప్రస్లోచ మోహాకల మాలాభూష ఘృతాచి తెంబయిన భిక్షమును, నఖాంకురగుర్తులతో మాణిక్యముద్రాలంకార మయూఖ కాంతులు సీలుకొను కెంగేలితోఁ బెట్టెనది రంభ, రంభాద్రుఫలసమ్మగమయిన భిక్షమును గామారికి, వలఖాబరుఁడు దవరాపుఁజన్నుల కెలవఁబట్టి యొత్తిన నఖక్షతరేఖ బయల్పడునట్లు పెట్టినది మంజుఘోష, కలఘోష ధరితకంకణ నూపుర ధ్వనులంకార భూషితయై యొయ్యనగా వల్లచేతెంచి, హేమపాత్ర సమ్మతి దివ్యాన్న పాయస పాసోభిక్షనొసఁగను సాగిణి దాక్షాయణీ భర్తకుఁ జక్షూరాగ మెలర్పఁగా మాధుకర భిక్షాన్నము నడ్డించెను ఊర్వశియు నప్పుడ చేతబచ్చి శ్రీవల్లభుమూర్తి పెచ్చెలికి వారిపైరికి ముంముఁగొండ రాజల్లునికి నవాన్నము భిక్షముగాఁ బెటెను. తిలోత్తమాప్సరస పులకాంకితముతో డను ఘృతంబుగొడను గూడిన భిక్షమును పసిఁడిపళ్ళెములంగల పరమేశ్వ కొంగింమకళాతి దవ్యుష్టిఫాలలోచనుని యూఁకు కన్నులకు ముద్దుటగొల్పునట్టుల పెట్టెను. సహజసౌజన్యమగు సహజన్య, దోయ్యేల కూలంకమంబులైన వీఁగుఁబాలిండ్లు పైఁట చెఱఁగు వీడకొలువ కంకణమునఁ బిరప్రభిక్ష పాసఁగ నడ్డించెను చిత్రరేఖ కనకమాత్రక మేఖలా కలకలము రత్నకంకణరవముతో రాయిడింప

# అంతర్వాహిని

## 'హితశ్రీ'

రివ్వురివ్వున వీచే గాలుల్లో జనతా ఎక్స్‌ప్రెస్ ముందుకి దూసుకుపోతూ పట్టాలు మారుతోంది. తనకి చేరువగా ఉన్న కిటికీ అద్దం పైకిలాగి విశ్వం తూర్పు దెసగా చూశాడు.

వయ్యారాలు వొలకబోస్తూ దవ్వుగవ్వులకి జరిగిపోయే చీకటి చీర చెంగు దొంగపుద్యుకుని వెలుగు వరాగా లాకుతుంటే ఆకాశం మునిముసిగా నవ్వుతోంది!

చైత్ర శుద్ధ పాడ్యమి.

తెల తెలవారుతోంది.

కొత్తగాలులు రివ్వున వీస్తూ విశ్వాన్ని పరామర్శించాయి. ఆ శుభోదయ సుందర దృశ్యాన్ని వేడుకగా చూస్తూ పులకించిపోయాడు విశ్వం. వెదజల్లించి ప్రసరించే అరుణ కాంతికి కొండల అంచులు గీతలు గీసినట్టు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆకాశమార్గాన పక్షులు స్వేచ్ఛగా కలకల గానం చేస్తూ బారులు బారులుగా సాగిపోతున్నాయి. దూరంలో పసుగణాలు తీరికగా పచ్చిక మేస్తున్నాయి. ఆ పరిసరాలు చూడగానే విశ్వానికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆ ప్రాంతాలో తనెప్పుడూ సంచరించలేదు, నిజమే కాని ఆ చిరపరిచిత దృశ్యాలన్నీ ఏదో ఆత్మీయతని జ్ఞాపకం చేస్తుంటాయి ఎప్పుడూ. అక్కడ రైలు దిగి ఆ ప్రదేశమంతా కాలినడకన తిరగాలని తన కెన్నోసార్లు అనిపించింది. కాని ఇప్పటివరకూ అది కోరికగానే నిలిచిపోయింది. మనుష్యుల కోరికలు కొన్ని ఎంత చిన్నవైనా ఎప్పుడూ కోరికలుగానే నిలిచిపోతూంటాయి. సముద్రస్నానం చెయ్యాలని తనకి ఎన్నోసార్లనిపించింది. వాల్తేరులో మూడు సంవత్సరాలు గడిపినా, చివరికి ఆ కోరిక తీర్చుకోకుండానే ఆ ఊరు విడిచి వచ్చేస్తున్నాడు.

రంయిమని వీచినగాలికి ఇంజన్లోంచివచ్చిన నుసి విశ్వం కంట్లో పడ్డది. తటాలున తల వెనక్కి లాక్కుని చేతి రుమాలుతో ఎలాగో అవస్థపడి దానిని తీసివేశాడు. కాని కన్ను ఎర్రబడ్డది. అప్రయత్నంగా ఎదురుగా ఉన్న సీటుపైకి చూశాడు విశ్వం. ఆ అమ్మాయి ఇంకా అలాగే తూర్పుని నిశ్చలంగా కిటికీలోంచి బయటికి చూస్తూనే ఉంది. తన అవస్థ ఆమె చూసేవుంటుంది అయినా తల లోపలికి తీసుకోదేం? తన ఉనికి గుర్తించటం ఆమె కేమాత్రం ఇష్టం ఉన్నట్టు లేదు. ఇంతకీ, స్వానుభవమైతే గాని ఏవిషయమూ మనుష్యులు గ్రహించరు. అందుకు కారణం ఒకప్పుడు నిర్లక్ష్యమూ, ఇంకోసారి అహంకారమూను. పాపం, ఆమె కంట్లో ఏదైనా పడితే అవస్థపడుతుంది కాబోలు. ఆడవాళ్లు ఎంతసేపటికీ పైకి డాబు పరేగాని ఎంత చిన్న ఉపద్రవం జరిగినా ఇట్టే బయటపడిపోతారు. అయినా, ఈ అమ్మాయికి కొంచెం టెక్కు ఎక్కువలా ఉంది. రాజమండ్రి నించీ చూస్తున్నాడు. ఒంటరిగా అర్ధరాత్రి రాజమండ్రిలో ఈవిడ రైలెక్కటం ఆశ్చర్యంగానే ఉంది. ఎవరో స్నేహితురాండ్రు మొదలైనవాళ్లు స్టేషన్‌కి వచ్చి సాగనంపి వెళ్లారు. అప్పటినించీ ఆమె మౌనంగా అలాగే తూర్పుని ఉంది. ఉత్తర హిందూస్థాని యువతిలా తలమీద ఆ ముసుగెందుకూ? తన అందం కళ్ళతో తాగెయ్యటానికి ఇక్కడెవరో సిద్ధంగా వున్నట్టు!

ఈ అమ్మాయి ఎవరోగాని వేషభాషల్లో నాగరికత ఉట్టిపడుతూ ఉన్నా కొంత పూర్వాచారాల చాదస్తం వున్నట్టుంది. గోదావరిలో డబ్బులు వేసి దణ్ణం పెట్టింది. తనకి నవ్వొచ్చింది. తను చూస్తున్నాడని సంకోచమైనా ఆమెకి కలగలేదు. ఆ అభిప్రాయం వుంటే ఓ చిన్న దొంగచూపు చూసివుండేది! అన్నట్టు ఆమె రెండుమూడుసార్లు తనవైపు చూసినట్టు అనుమానంగా ఉంది. తన తోలుసంచీ వైపుమాత్రం తిప్పకుండా చూసింది. బహుశా దానిమీద తన అడ్రసు వుండి వుంటుందనుకుంటేనో! అంత తెలుసుకోవాలని

ఉంటే తనని అడగకూడదూ? పలకరిస్తే నోటిముత్యాలు రాలిపోతాయి కాబోలు. ఎక్కడికి వెళుతుందో ఈమె! ఒకవేళ విజయవాడలో దిగిపోతుందేమో!

ఈ ఆలోచనరాగానే మళ్ళీ కిటికీలోంచి బయటికి చూశాడు విశ్వం. జనతా ఎక్స్‌ప్రెస్ విజయవాడ సమీపిస్తోంది. కేవలం ఇంజన్ గావుకేక పెట్టింది. తను గుంటూరుదగ్గర బండిలోకి రావాలి చేతి దీనారం చూసుకుని, లేచినుంచుని పాదాల్ని సర్దుకోబోగాడు విశ్వం. తోలుసంచీ తియ్యబోయి అప్రయత్నంగా ఆమెవైపు చూశాడు. అతను ఆమె యథాలాపంగా తన పాదాల్నవైపు చూసింది. ఒక్క క్షణం విశ్వంలో ఏదో బలహీనత ఆవరించి తన అడ్రస్ ఆమెకి కనిపించేలా ఆ సంచీ తిప్పాలని అనుకున్నాడు. కానీ వెంటనే ఆ ఊహకి సిగ్గుపడ్డాడు. తనెందుకు ఆమెని గురించి అంతసేపు ఆలోచించాడు? తనెవరు, ఆమె ఎవరు? ఆమెని మళ్ళీ తన జీవితంలో ఎప్పుడూ చూడటం తటస్థించకపోవచ్చు. పైగా ఆమె తనకి స్నేహితురాలేమీ కాదు. ఆమెతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు. రాజమండ్రినుంచి కలిసి ప్రయాణం చేశాను, నిజమే. అయినా ఆమెని గురించి ఏ విషయమూ తనకి తెలియదు. తనని గురించి ఆమెకి తెలియదు. ఆమె తనని గురించి ఏమైనా అనుకుందో, లేదో! అనుకునే ఉంటుంది. తను ఏవేవో అనుకున్నాడు. ఆమె మాత్రం ఎందుకనుకోకూడదు! చిత్రం, ఇంతసేపు ప్రయాణంచేసే మనుషులో అనుకోటాలతో నడిపోతున్నారు తనూ, ఆమే. తోటి ప్రయాణీకులతో మాట్లాడకుండా దూర ప్రయాణాలు చేసిన రోజులున్నాయి—భాష తెలియనందువల్ల. ఆ వ్యక్తి తెలుగువాడై, మగవాడైతే తను మాట్లాడకుండా వుండడు. కానీ 'ఆమె' అయిపోయింది ఆ వ్యక్తి!

ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారం సమీపిస్తోంది. ఆమె ఏమిటో సర్దుకుంటున్నట్టుంది. సామాన్లు ఏమీ లేవు. ఒక చిన్న చేతిసంచి మాత్రం ఉంది. వెనక్కి తిరిగి చూడాలనిపించింది విశ్వానికి. కానీ సాహసం చాలలేదు. ఒకవేళ అదే సమయంలో ఆమెకూడా తనవైపు చూస్తే!

"టిక్కెట్టు పోయిందండీ"

ఆందోళన వ్యక్తమయే సన్నని స్వరం వినిపించింది. విశ్వం గుండె కొట్టుకోవటం స్పష్టంగా విన్నాడు. వెనక్కి తిరిగాడు. కానీ ఆమెవైపు చూడటానికి విడియపడ్డాడు.

"ఎలాగండీ?"

ఏం చెప్పాలో విశ్వానికి తెలియలేదు.

"ఎలా పోయింది!" ప్రయత్నించి అడిగాడు.

"ఏమో చేతి సంచులో పెట్టుకున్నాను కిందపడి పోయిందేమో!"

విశ్వం చుట్టుపక్కల చూశాడు. ఏమీ కనిపించలేదు. ఆమె గాభరా పడుతోంది. అతనికి కొంచెం చిరాకు వేసింది. ఆడవాళ్ళు జాగ్రత్త మనుషులని తను ఇప్పటిదాకా అనుకున్నాడు.

"బయటపడిపోయి ఉంటుంది. ఎలాగండీ?" అందామె.

"టి. సి. తో చెప్పండి" అందామనుకున్నాడు. కానీ జాలివేసింది. ఇదికాక తనేమీ చెయ్యలేకపోతే పూర్తి అప్రయోజకుడు మనుకుంటుందేమో. ముక్కూ మొగం ఎరగని మనిషే అయినా ఆమె తనని గురించి అలా అనుకోటం ఇష్టంలేదు.

"పోనీలెండి, పోయినా ఫరవాలేదు. ఇంకో టిక్కెట్టు తెచ్చిపెడతాను. ఎక్కడిదాకా వెళ్ళాలి?" అడిగాడు ధైర్యం చెబుతున్నట్లు.

"విజయవాడలో దిగిపోతానండీ" ఆలోచించాడు విశ్వం. కేవలం ఎక్స్‌ప్రెస్ ఆగింది.

"టికెట్ నంబరు తెలుసా?"

"ఊహూఁ"

ఇంత అజాగ్రత్త మనిషికి పరాకేమిటి? తనెప్పుడూ టికెట్ కాదుగదా, ఇంకేదీ కూడా పారేసుకోలేదు. అయినా, టికెట్ కొనగానే నంబరు చూసి గుర్తుపెట్టుకోటం తనకి అలవాటు.

"ఇప్పుడేం చెయ్యమంటారండీ?" అని, రైలుదిగి నడవసాగాడు విశ్వం. గార్డు కనిపించాడు. అతనితో చెబుదామనుకున్నాడు విశ్వం. కానీ ఏం లాభం? ఎక్సెస్ కట్టుకోవాలిసిందే నంటాడు. ఆమె దగ్గిర డబ్బుందో, లేదో. అబ్బ, సమస్యలు తెచ్చిపెట్టటం ఈ ఆడవాళ్ళ నైజం. విసుగ్గా ప్లాట్‌ఫారం చివరిదాకా ఓ చూపు విసిరాడు విశ్వం. చప్పున అతనిలో ఊహా తట్టింది. గబగబ బుకింగ్ ఆఫీసు దగ్గిరికి వెళ్ళి ఓ ప్లాట్‌ఫారం టికెట్ తీసుకుని వెనక్కి వచ్చాడు. కిటికీ

మకోణాలా, సినిమా థియేటర్లూ, కృత్రిమ పోకడలూ, కావ్యాల్లో క్రమపద్ధతిన పెంచబడిన తోట్లూ, రేడియో సంగీతం, అంగలార్చే నిరంతర సైగ్నల్లాగా అతని మనోవీధిలో ఆవరించి అంతరించాయి ఎన్నాళ్ళకి! తను ప్రకృతి మధ్యన ఒంటరిగా తన్మయత్వంతో నిలబడగలిగాడు! ప్రకృతిసౌందర్యం వ్యక్తిం చలేకపోయినా హృదయం సౌందర్యం పెంపొందుతుంది. మానవుడి నిసర్గమైన ప్రేమ. ఆ సహజమైన సహజ ప్రాకృతిలో భాసిస్తుంది కృత్రిమ వాతావరణంలో నివురుగప్పిన నిప్పులా అంతర్గతంగా వెలుగుతూ ఉంటుంది. విశ్వం గట్టిగా ఊపిరి పీల్చి వొదిలాడు. ఏదో బరువు తన మీద నించి తొలగినట్టుగా ఉంది. తనేదో సత్యం కనుక్కున్నాడు. ఏదో చీకటి తెర తొలగిపోయినట్టయింది. వసంతుడు మంచు తెరలు తొలగించి వస్తే తన మనసుని ఆవరించిన నీలితెరలు తను ఒక్కొక్కటే తొలగించుకుంటున్నాడు ఇప్పటికైనా తను మానవుణ్ణి ప్రేమిస్తున్నాడు నిజమైన ధ్యేయమైన అతని దర్శనం నిరసిస్తున్నాడు అనారోగ్యం దుఃఖం అంతరూ చెయ్యగలిగినవే కార్యకారణాలు అర్థం చేసుకోటంలోనే నిజ్జత ఉంది

ఆలోచిస్తూ నడుస్తున్న విశ్వం మనసులో ఓ సందేహం కలిగింది. వసంత శోభకి హృదయం ప్రఫుల్లితమై ఉదాత్తమౌతుంది నిజం. కాని హేమంతంలో

విశ్వం భావవీధిలో మెరుపు మెరిసింది. ప్రకృతి సౌందర్యమూ జనానికి నిత్యం తను విస్మరిస్తున్నాడు ఎండిన పువ్వుల్లో, రాలిన ఆకుల్లో, తెలిమబ్బుల్లో, మంచు తెరల్లో అందాలు తొలకిసలాడవా? సౌందర్యం ప్రకృతికి సహజం. ప్రేమ మానవునికి సహజం. ఇది రెండూ ముడిపడితే ఇతరేతరాశ్రితాలు విభిన్నమైన వద్ద తను ప్రకృతికి, మనిషికి అవినాభావ సంబంధం కల్పిస్తున్నాడు. తనకు తెలిసిన అనేక విషయాల్లో ఇది నవ్యనూతనమే. ఇది కొత్త సంగతేమీ కాదు. కాని తను ఈ కోణాన అనుభవ పూర్వకంగా తెలుసుకుంటున్నాడు. భావకవి బతుకుగా చేసుకున్న కళారాధకులు ఈ సత్యాన్ని అనుభూతి పొంది ఉంటారు. తను కళారాధకుడు కాకపోవచ్చు కాని కళాకారి కాగలడా? సర్వత్రా సౌందర్యాన్ని దర్శించగలడా?

తను అనుకోకుండా పెద్ద ప్రశ్నే వేసుకున్నాడు. సర్వత్రా సౌందర్య దర్శనం! అన్నిచోట్లా, అన్నిటిలో సౌందర్యం చూడగలవాడు ధన్యుడే. అది ఆదర్శం. రససిద్ధుల కది సాధ్యమేమో. తనలాంటి సామాన్యమానవుడికి సంగతేమిటి? వస్తుతః ఆర్ద్ర హృదయుడైతే అప్రయత్నంగానే రసానుభవం పొంది జీవితంలో పూలబాటలు పరుచుకుని సాదరంగా ఇతరులకి ఆతిథ్యమిచ్చి జీవితసౌఖ్యం పంచుకుంటాడు. కాని ఈ రోజుల్లో అంతటివారున్న ఎంత మంది!'

ఏ మామిడికొమ్మమీదినించో కోయిల కుహూమంది.

ఆ మధుర సంగీతం విశ్వం ఆలోచనల్ని పారద్రోలింది. ఆ సంగీతం వినిపించినవైపు తలెత్తి చూశాడతను

మళ్ళీ కొమ్మమీది కోయిల కుహూమంది. పరవశించాడు విశ్వం. ఆ సంతోషంలో కొంటెంగా తను కూడా 'కో' యన్నాడు

ఎవరో రైతు కాబోలు విశ్వం పక్కనుంచి వెళుతూ "మంచిదేగా?" అన్నాడు

అంతలో ఏదో ఎగతాళి గోచరించింది విశ్వానికి "ఏం ఊరక?" అన్నాడు వెక్కిరించినట్టు. ఆ రైతు కొంచెం వింతగా చూసి ఏదో అనబోయాడు. విశ్వం సమాధానం చెప్పకుండా ముందుకి వెళ్ళాడు. మరుక్షణంలోనే తను అలా అన్నందుకు అతను విచారించాడు. అలా అనటం పల్లెలో రివాజే. తను అవతలరంగా తొందరపడి అపార్థం చేసుకుని అగౌరవంగా సమాధానం చెప్పాడు. తరుచు మనుషుల లోపాలే వాళ్ళ అపార్థాలకి కారణాలు. ఇతర్ల మీద తను లోపాల ఫలితాలు రుద్దటం ఘోరం. విశ్వం తన ప్రవర్తనకి సిగ్గుపడ్డాడు.

కొద్దిమలుపు తిరిగేసరికి బాటమీద కొంచెం దూరంలో ఏదో పనిలో నిమగ్నులైన జనం కనిపించారు. మరి కొంచెం దగ్గిరికి వొచ్చేసరికి వాళ్ళంతా రోడ్డుమీద కంకర వేసే పనిలో ఉన్నారని గ్రహించాడు విశ్వం. అతనికి కొంచెం ఆశ్చర్యం వేసింది. వాళ్ళెవరూ కూలీజనంలా లేరు. అందరూ యువకులు. విద్యార్థుల్లా కనిపిస్తున్నారు. పూర్తిగా దగిర

కొచ్చేవరికి విద్యార్థులకి అసలు సంగతి తెలిసింది. కాళ్లేం విరూ కాలేజీ విద్యార్థులు కాలేజీ సాంఘిక సేవా సమితి సేవా శిబిరం ఈ సారి ఈ ఊళ్లో పెట్టారన్న మాట. విశ్వం వినోదంగా కొద్దు విద్యార్థుల కార్యక్రమం చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో ఆ శిబిరం నిర్వహించే కాలేజీ అధ్యాపకుడు అటు వైపుకి వచ్చాడు. విశ్వం అతనికి పాత విద్యార్థి. 'నమస్కారం మాస్టారూ!' అన్నాడు విశ్వం

"ఏమోయ్, ఇలా వచ్చావు, ఏంచేస్తున్నావిప్పుడు?" అడిగాడాయన

"ఎకనమిక్స్ ఆనర్స్ పరీక్షకి కట్టానండి"

"అలాగా బాగా రాశావా?"

"బాగానే రాశానండి."

"సంతోషం. ఇలా వొస్తున్నావేమిటి కథ?"

తన మేనమామగారు అక్కడనీ, చుట్టపు చూపుగా చూసిపోదామని వచ్చాననీ చెప్పాడు విశ్వం. ఆ అధ్యాపకుడు కొంచెం దమువుతీసుకొని అన్నాడు

"అయితే నువ్వు ఒకపనిగా ఈ కూరవాడికి మరి మా కూరివనిలో నువ్వు లేకుండా ఎలా? శ్రమదానం చేసితీరాలిసిందే!" అన్నాడు.

విశ్వం చిరునవ్వు నవ్వాడు. తను ఆ కాలేజీలో చదివినప్పుడు ఇటువంటి కార్యక్రమాల్లో ఎన్ని పాల్గొన్నాడు మాస్టారుగారు అవి ప్రత్యేకించి ఆ జ్ఞాపకంతోనే బలవంతం పెడ్తున్నారని తనకి తెలుసు

"ఏమిటోయ్ తటపటాయిస్తావు అదిగో, ఆ పాత ఫ్రెండ్సుకో పద నేనూ వొస్తున్నాను" అని హుషారిచ్చాడు అధ్యాపకుడు ఆయనమీద గౌరవంవల్లనైతేనేం, ఆ సమయంలో తనకి ఉత్సాహం కలగటం వల్లనైతేనేం విశ్వం రంగంలోకి దూకాడు.

ఉదయం మూడు తొమ్మిదిన్నర గంటలు కావస్తోంది. అలిసిపోయాడు విశ్వం. పార పక్కన పడేసి తన దేహం చూసుకుని అదిరిపోయాడు తెల్లటివస్త్రా ప్రోజులూ ఎర్రగా అయిపోయాయి. నలిగిపోయాయి. ఈ అవతారంలో మామయ్యగారింటికి వెళ్లటం ఎలా? తనకి ముందుచూపు లోతిగా తక్కువ. తనని చూడగానే మామయ్య "ఏమిటోయ్, గృహింగ్ డూ తీ వా?" అనడుగరా! ఏంచేయటం? అప్పటంలో గాని, ఇంకెక్కడగాని ఇంటికి వెళ్ళలో పువ బట్టలు మార్చుకోటం అసంభవం.

"ఏమోయ్, వదతా నేమిటి?" అన్నాడు అధ్యాపకుడు.

"అవునండి"

"అలసిపోయావు వెళ్లు మళ్ళీ కలిసిస్తావుకదూ విస్ యూ గుడ్ లక్" అన్నాడాయన.

విశ్వం సాంపుతీసుకుని కాళ్ళీడ్చుకుంటూ తల వొంచుకుని ఇల్లు చేరుకున్నాడు. మామయ్య ఇల్లు తనకి బాగా గుర్తే పెద్ద మర్రిచెట్టు దాటగానే చెరువు, చెరువు పక్కనే ఉన్న పెద్ద మండువాఇల్లు. అదే ఆయన నివాసం

సంకోచిస్తూ ఓరగా వేసి వున్న తలుపు నెట్టి లోపలికి ప్రవేశించాడు విశ్వం పెద్ద అరుగూ,బాదం చెట్టూ, పూలమొక్కలూ, ఓమూల గొడ్లపాకా అన్నీ తనకి బాగానే జ్ఞాపకం ఉన్నాయి.

గొడ్లదగ్గర మోకాలి వరకే లాగ బట్టలుకట్టిన గడ్డి పరకలు దులుపుకుంటున్న వెంకట్రామయ్యగారు తలుపు చప్పుడు విని తలెత్తిచూసి కేకేశారు.

"ఎవరోయ్ అది?"

గోనెకి పిడకలు కొడుతూ ఆ కేక విని సీతమ్మగారు వెనక్కి తిరిగి విశ్వంవైపు ప్రశ్నార్థకంగా చూసింది

పడమరదిక్కున ఒకమూల బావిదగ్గర మీద బట్టలు జాడించుకుంటున్న అమ్మాయి, జానకి, ముంగురులు వెనక్కి తోసుకుంటూ, స్వేదబిందువులు తుడుచుకుంటూ పక్కకి తిరిగిచూసింది.

పలుగు వేలమీద పొడుచుకుంటూ, ఎగకట్టిన పంచెలో నిలోంచి అప్పుడే వొస్తున్న నూరి విశ్వం వైపు పరకాయించి చూశాడు.

చిల్లిందర్నీ చూసి విశ్వం చిరునవ్వు తెచ్చుకుని పెదిమలు కదిలించబోయే లోపుగా వెంకట్రామయ్యగారే కేకేశారు.

"ఓరి నువ్వట్రా" మన విశ్వమేనట్రా, అలా చూస్తారేం?"

"అంతా బాగున్నారా బాబూ?" అంది సీతమ్మ

# అంతర్వాహిని

"ఊ, బాగానే వున్నారత్తయ్యా" అన్నాడు విశ్వం. వెంకట్రామయ్యగారు పకపక నవ్వుతూ, "ఇకేం చేస్తుంటావ్?" అన్నారు

"ఎక్కడ పడ్డావయ్యా బాబూ?" అన్నాడు సూరి

"కాళ్ళు కడుక్కోటానికి వేడి నీళ్ళివ్వవే జానకీ, అలా పిచ్చి మొద్దల్లే చూస్తావేం?" అంది సీతమ్మగారు.

విశ్వం ఉక్కిరిబిక్కిరి అయాడు.

జానకి చెంబులో నీళ్ళుతెచ్చి దగ్గిర పెట్టింది. ఆమెవైపు అప్రయత్నంగా చూశాడు విశ్వం. తలంటి పోసుకున్నట్టుంది జుట్టు చుట్టచుట్టుకుని వదులుగా ముడివేసుకుంది. చెంపలమీద ముంగురులు జారిపడు తున్నాయి. శరీరం తీగలా వంగి స్ప్రింగ్ లా చివాలున మళ్ళీ వెనక్కి వెళ్ళింది.

"ఈ అమ్మాయి మన జానకేనా?" అన్నాడు విశ్వం. ఆ మాటలు అతని నోటవెంట ఎలా జారాయో అతనికే తెలియదు.

"మంచున్న పళంగా పెళ్ళి చేసెయ్యాలి లేకపోతే, అలా భయపడతావేం, ముందు కాళ్ళు కడుక్కో" అంది సీతమ్మగారు ముసిముసి నవ్వులతో.

విశ్వం సిగ్గుపడ్డాడు. చెంబెడు నీళ్ళూ కాళ్ళమీద దొర్లించుకుని అక్కడికి చేరువలోనే వాల్చివున్న మంచంమీద కూలబడ్డాడు. జానకి ఎంతలో ఎంత మారిపోయింది! పన్న పెళ్ళికి వెళ్ళినప్పుడు చూశాడు గాని జానకిని చూడలేదు. ఏదో కారణంవల్ల రావటానికి వీలుపడలేదన్నారు ఇంతలోనే గుర్తుపట్టటానికి వీల్లేకుండా మారిపోయింది ఎంత ఆశ్చర్యం!

"ఈ విషయమంతా ఏమిటో చెప్పనేలేదే!" అన్నాడు సూరి. విశ్వం ఆలోచించి తేరుకుని జరిగిన విషయం చెప్పి అన్నాడు.

"ఛ ఛ వెధవపని, ఇక జాతకాల్లో పడ్డాను. ఊళ్ళోకి రావటానికే సిగ్గుపడి చచ్చాను అనుకో"

సూరి బిగ్గరగా నవ్వాడు

"మా సొంత పనులకోసం ఒళ్ళు విరుచుకుంటూ అదే ఎంతో గొప్ప అని మేమూ, అందరూకూడా అనుకుంటుంటే నువ్వు ఇతర్లకోసం శ్రమపడికూడా సిగ్గు పడతావేమిటోయ్ బాబూ?"

ఆ మాటల్లో ఏదో అర్థం తెలుసుకున్నట్లు తెలిసి వెలుగు కనిపించినట్టయింది విశ్వానికి. తనుపొరబడ్డాడు తను ఎంతసేపటికీ తననుగురించి ఇతర్ల దృష్టులు ఆధారంగా ఆలోచించటం ఎందుకో తనకి అర్థంకావటం లేదు తననుగురించి తన అభిప్రాయంకంటె ఇతర్ల అభిప్రాయాలకి విలువ ఇస్తున్నాడు. అంటే తననుగురించి ఇంతవరకూ ఒక నిర్దిష్టమైన అభిప్రాయం తనకి లేదన్న మాట. విషయం తెలిస్తూ వెంకట్రామయ్యగారు అడిగారు.

"ఎక్కడినుంచి రావటం?"

"వాల్తేరు నించి"

"ఏం, అంత బుద్ధి పుట్టిందే? ముందురాస్తే బండి పంపేవాణ్ణిగా"

"ముందు అనుకోలేదు"

"అంటే ఎగ్గొట్టాలనే అనుకున్నావన్నమాట పదలే, ముందు స్నానం చెయ్యి తరవాత తీరిగా మాట్లాడుకుందాం. పండక్కైనా వచ్చావు, అదే చాలు"

సూరి స్నానాలగదికి దారితీశాడు. విశ్వం అనుసరించాడు

స్నానంచేసి బట్టలు వేసుకుని హాల్లోకి రాగానే బల్లమీద అద్దం, గవ్వెన్నా పెట్టి వెళ్ళింది జానకి మళ్ళీ వెంటనే వచ్చి "హేరాయిల్ సీసా బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది.

"ఇవన్నీ నాదగ్గర వున్నాయి"

"ఇక్కడా వున్నాయిగా"

విశ్వం ఇంకేమీ అనలేదు. జానకి కూడా అక్కడ లేదు. ఏదో మాటాడాలనిపించింది విశ్వానికి కాని ఏదో అడ్డుపడుతోంది ఈ జానకితో చిన్నప్పుడు మొన్నటిదాకా తను అంత స్వేచ్ఛగా మాట్లాడింది వయసులో మార్పు ఎన్నెన్ని విషయాల్లో మార్పు తెస్తుంది!

వరండాలోకి వచ్చాడు విశ్వం. అప్పటికే పేపరు తెచ్చినట్టుంది వెంకట్రామయ్యగారు పడక కుర్చీలో కూర్చుని చదువుతున్నారు. పలుగుతో తేలిగ్గా పాత కొబ్బరికాయల పీచు తీస్తున్నాడు పాలేరు వెంకన్న. సూరి సహాయం చేస్తున్నాడు

"ఏమిటి మామయ్యా విశేషాలు?"

వెంకట్రామయ్యగారు తలెత్తి చూసి "కూర్చోరా" అన్నాడు.

ఇంతలో సీతమ్మగారు వచ్చి కాదంబాలు ఒకటి అందిస్తూ, "ఇదికొంచెం నోట్లో వేసుకో నాయనా" అంది

"ఏమిటత్తయ్యా ఇది?"

"ఉగాది పచ్చడి."

విశ్వం మాట్లాడకుండా రుచిచూశాడు

"కొత్తసంవత్సరం నీకు బాగా రాణిస్తుంది లేవోయ్" అన్నారు వెంకట్రామయ్యగారు

"మీ అందరికీ కూడా" అన్నాడు విశ్వం

అప్పుడేవొస్తున్న సూరి అందుకున్నాడు "మా కేమిటిలే, నీకు మంచి గిరాకీ తగుల్తుంది సంవత్సరం పొడుగునా సాంఘికసేవ చేస్తూనే ఉంటావులే"

నవ్వాడు విశ్వం

ఏడాదికి తొలికోతాల తొలిఘడియలు సంతృప్తికరంగానే గడిచాయి తనకి. ఈ కొత్తసంవత్సరం పాతబడేసరికి తన జీవితంలో ఏ యే మార్పులు జరుగుతాయో! తీపి, చేదు, వగరు, పులుపుల మిశ్రమమే జీవితం అని ఉగాది పచ్చడి హెచ్చరిక చేసింది. అందులో వేసిన ఆ రోటి కొత్త ఫలపుష్పాలు జీవితపు కొత్త అనుభవాల సంపుటికి ప్రారంభోత్సవం చేశాయి

## 2

భోజనానంతరం కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకుని మంచంమీద వెన్ను వాల్చగానే తెలియకుండానే కునుకు పట్టింది విశ్వానికి. లేచి చూస్తే సూర్యుడు పడమటికి తిరిగి ఉన్నాడు. రిస్ట్‌వాచీ చూసుకున్నాడతను. అప్పుడే నాలుగు దాటింది. అంతా పనులమీద ఉన్నట్టున్నారు. దగ్గిర ఎవరూ లేరు. కొంచెం దూరంలో పాలేరు వెంకన్నమాత్రం కొబ్బరికాయల పీచు తీసే పనిలో నిమగ్నుడై ఉన్నాడు. అతనిని చూడగానే విశ్వానికి జాలేసింది పండగపూట కూడా అతనికి పని తప్పదల్లే ఉంది

విశ్వం నిద్ర లేవటం వెంకన్న చూశాడు.

"ఏం బాబూ లేచారా?" పలకరించాడు.

"ఊఁ" అన్నాడు విశ్వం.

వెంకన్న ఓ కొబ్బరి బొండం జాగ్రత్తగా చెక్కి రంధ్రం చేసి విశ్వాని కిస్తూ అన్నాడు.

"దాహం పుచ్చుకోండి, బాబూ. మా చెడ్డ ఎండగా ఉంది"

విశ్వం అడ్డు చెప్పలేదు

"మన తోటలో కాయేనండి ఇయ్యాలంటే ఊళ్లో వాళ్లు ఎగబడతారనుకోండి"

మన తోట !

ఇద్దర్నీ కలిపి మాట్లాడుతున్నాడు వెంకన్న. నిజానికా తోట ఇద్దరిలో ఎవరిదీ కాదు పాపం, శ్రమ చేసేది తనే. కనక అదోరకమైన తృప్తి పొందుతున్నాడు కాబోలు ఈ దేశంలో శ్రమకి ఫలితం దక్కటం అంత సులభంగా జరిగేది కాదు. సానుభూతి చూపిస్తూ అన్నాడు

"పండగనాడుకూడా పనేనా. టోయ్, హాయిగా విశ్రాంతి తీసుకోక?"

"పండగైతే పని చేయకూడదా బాబు! పని చెయ్యకపోతే నాకు వొళ్లు ఇరగొట్టినట్టుంటది"

"అంత చెయ్యాలని ఉంటే సొంత పనేదైనా చేసుకోకూడదూ?"

"ఇది సొంత పని కాదంటండీ?"

అమాయకుడల్లే ఉన్నాడు అంధ్రదేశం రాజకీయంగా ఎంతో ముందున్నదని తను అనుకుంటున్నాడు చైతన్యవంతమైన ప్రజ అని గర్వపడేవాడు. పీడిత శక్తుల్ని గురించి ఏమీ తెలియనట్టు మాట్లాడతాడేం ఇతను!

"నువ్వు వట్టి అమాయకుడివోయ్"

వెంకన్న చిరునవ్వు నవ్వాడు.

"అయితే ఆ తప్పు ఆసామీగారిదేనండి. అది తోటే చెప్పండి ఆమాట"

నిర్ఘాంతపోయాడు విశ్వం. ఇతనేదో వ్యంగ్యగర్భితంగా మాట్లాడుతున్నాడు అతనలా అంటాడని తను ఏమాత్రం ఊహించలేదు.

"అంటే?" అన్నాడు అర్థం కానట్టు తెలియజేస్తూ.

అప్పుడే అటువైపు వస్తున్న సూరివైపు చూపిస్తూ అన్నాడు వెంకన్న.

"నీకు తెలుసు లేరా విశ్వం నా భ్యాసాలో"

"పొలాలు కౌలు కిచ్చేసి అందరూ ఒక చోటే ఉండొద్దు. విశేషంగా రెండెకరాలు కొనాలని ఎం ఏ ప్యాసై వస్తాడు"

"అక్కడితో అయిపోయిందేమిటి? మరో కట్ట చద వాలనిపించవద్దు. చదువుకి అంతేమిటి? మా పరిస్థితులు చూసుకోవాలి గాని"

"నీకెప్పుడం హొస్తే రవొద్దుగాని ఈ విష యంలో నువ్వు నీ స్వార్థమే చూసుకుంటున్నావు మావయ్యా"

వెంకట్రామయ్యగారు వాడిగా నవ్వారు.

"పోనీ అలానే అనుకోండి. వాడికి అంతపట్టుదలగా ఉంటే చదవొద్దని నేనేం అనలేదే"

"అదా రాజకీయపు దెబ్బ, నువ్వు మనస్ఫూర్తిగా ఒప్పుకునక పోతే వాడు ఒప్పడు"

"నేను వాడి బాగుకోరే వాడినికాదా?"

విశ్వానికి విసుగుపుట్టింది. ఊరుకోమన్నట్టు సంజ్ఞ చేశాడు సూరి

"నీ ఇష్టం" అన్నాడు విశ్వం

కొంచెం సేపు ఎవరూ మాట్లాడలేదు. మునసబు గారి బండి వేగంగా వస్తోంది. ఇద్దరు పాలేళ్ళకీ కొంచెం పోటీ పడ్డది ఎవరి ఎద్దులూ తీసిపోయినవి కావని రుజువు కావాలి గంటల మోతలు ఎక్కువయాయి. ఎదురెదురుగా వచ్చే బళ్ళ మధ్యదూరం తగ్గుతోతున్న కొద్దీ పోటీ ఎక్కువ కాసాగింది.

బండిని బండి దాటుతోంది. ఇరుసూ ఇరుసూ ఒరుసుకుని చక్రం చక్రం ఢీకొన్నాయి. ఆగి పోయాయి బళ్లు రెండూ, ఇరుసులు తప్పించాలి వెంకన్న దిగ పోయి మళ్ళీ ఎందుకో మనసు మార్చుకుని కూర్చున్నాడు. అవతల వ్యక్తీ అలాగే చేశాడు. వాళ్ళిద్దరూ మాటామాటా అనుకున్నారు నీది తప్పంటే నీది తప్పన్నారు. ఎవరిది తప్పో తేలలేదు. ఇంటువంటివి లేనేవి కూడా కాదు మునసబు గారు కదల్లేదు తీరిగా కూర్చున్నారు. వెంకట్రామయ్యగారూ అంతే

"ఏమిట్రా ఈ గొడవ?" అన్నాడు విశ్వం.

సూరి వాడిగా నవ్వాడు "మనం బండి దిగితే వాళ్లు అంతస్తు తక్కువ, చిక్కే!" అన్నాడు.

పాలేళ్లూ మాటలు మానుకున్నారు.

"ఇద్దరూ పొలాల్లో పనిచేసుకునే వాళ్లే ఇద్దరూ శ్రమజీవులే పాడువ తెస్తే రెండూ రెండోలు చూసుకునేవాళ్లే ఈ కీచులాట ఎందుకు?"

"అదే తమాషా వాళ్లకోసం కాదు వాళ్లు పేచీ. వాళ్ల యజమానులకోసం, యజమానుల ఘనతబట్టే తమ ఘనత కొలుచుకోటం ఇంకా పోలేదులే." చిన్నగా చెప్పాడు సూరి.

వెంకట్రామయ్యగారు కొంచెం ముందుకి వచ్చారు

మునసబుగారుకూడా జరిగారు పాలేళ్ల మాటల్లో యజమానులకూడా కలిశాయి. పోరు ఘోరమయ్యే సూచన కనిపించింది.

బండిలోంచి గభాలున దిగాడు సూరి వెనకే విశ్వంకూడా దూకాడు.

అవతల బండిలోంచి అదే సమయంలో ఒక యువకుడు కిందికి దూకాడు ఇంచుమించుగా ఒకే సమయంలో అందరూ ఇరుసుమీద చెయ్యేశారు. బళ్లు విడిపడ్డాయి ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు. మళ్లీ బళ్లలో ఎక్కారు. క్రమ క్రమంగా బళ్ల మధ్య దూరం ఎక్కువ కాసాగింది

వెంకట్రామయ్యగారు ఓ సారి ఆకాశంలోకి చూస్తూ కొంచెం అర్ధ స్వగతంగా అన్నాడు.

"నా చిన్నతనపు రోజుల్లో ఇలాగే జరిగివుంటే తలకాయలు ఎగిరేవి."

ఆలోచనలో మునిగిపోయిన విశ్వం ఆ మాటలు విని సూరివైపు కొంచెం ప్రశాంతంగా చూశాడు. అతను నిర్లిప్తంగా శూన్యంలోకి చూడసాగాడు

"ఆ అబ్బాయి ఎవరు?"

"మునసబుగారబ్బాయి, పట్నంలో చదువుకుంటున్నాడు" క్లుప్తంగా చెప్పాడు సూరి.

ఆ తరవాత చాలా సేపటిదాకా ఎవరూ ఏమీ మాట్లాడలేదు. చిరుగంటల గణగణ వింటూ కూర్చుండిపోయారు

[సశేషం]

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

భారత స్వాతంత్ర్య దినం నాడు ఢిల్లీలో లార్డు మౌంట్ బాటన్ మాట్లాడుతూ "భారతీయులు, ఆంగ్లేయులు కలిసి మెలిసి సంచరించిన గత కొద్ది శతాబ్దాల్లోనూ ఆంగ్లేయ జీవనవిధానము, అచారవ్యవహారాలు, భాష, ఇక్కడి భారతీయుల సాంగత్యం వలన ఎంతగానో మారిపోయినవి — కాని దానిని గుర్తించడం మాత్రం ఇంకా జరుగలేదు" అని అన్నారు. ఇది అక్షరాలా యదార్థం. నాలుగువందల సంవత్సరాల క్రిందట, ఏనాడు ఆంగ్లేయులు వ్యాపారమన్న కారణంతో మన గడ్డమీద అడుగుపెట్టారో, ఆ నాటినుండీ సుదీర్ఘమైన, సుస్పష్టమైన సంబంధ బాంధవ్యాలు మనకూ వారికీ ప్రారంభమయ్యాయి. సాంఘికార్థిక, రాజకీయ రంగాల్లోనే కాకుండా, భాషలో కూడా ఇరుతెగలా ఎంతో మార్పు జరిగింది.

పండిట్ నెహ్రూగారో సందర్భంలో మాట్లాడుతూ "ఇటీవలనే ఆంగ్లభాషలో హిందూస్థానీ పదాలు ఎన్ని ప్రవేశించాయన్న విషయాలంతో కొద్ది పరిశీలన చేశాను. కానీ ఆ మహాకార్యాన్ని చివర వరకూ కొనసాగించడం మాత్రం జరిగింది కాదు. అయినా చేసిన ఆ కొంచెం కృషిలోనే, లెక్కకు మిక్కిలిగా హిందూస్థానీ పదాలు, ఆంగ్లభాషలో కన్పించడం నాకు చాలా ఆశ్చర్యం వేసింది" అన్నారు. హిందూస్థానీపదాలు మాత్రమే కాదు, ఏ మాత్రం కొద్ది పరిశీలన చేసినవారికైనా, భారతీయ భాషలన్నీ కూడా, కొద్దో గొప్పో, తమతమ పదాభరణాలతో ఆంగ్లభాష నలంకరించడం విస్మయం కల్గించక మానదు.

ఆంగ్లరచయితలు కూడా ఈ పరిస్థితిని గుర్తించారు. కాని కొద్దిమంది మాత్రమే గణనీయమైన కృషి చేశారు. మరికొంతమంది తగినంత కృషి చేయకుండానే, సర్వమూ తెలుసుకున్నట్టుగా ప్రవర్తించారు. కొన్ని నిర్ణయాలు కూడా చేసివేశారు. [1] డాక్టర్ సెరీయాన్. సర్ జీన్‌స్టన్, ఆంగ్లంలో భారతీయపదాలు మొత్తం 188 (అక్షరాలా నూటఎనభై ఎనిమిది) మాత్రమే అని లెక్క తేల్చారు. ఇదేగాక విఖ్యాతులైన ప్రొఫెసర్ వీక్లీ చేసిన పరిశోధన అంతా గాలిలో దీపమన్నమాట. చివరకు ఆయన [2] cod ఇచ్చిన మాటలనైనా లెక్కలోకి తీసుకోలేదు. ఆ విధంగా "బ్రాహ్మిన్, బెంగల్" మొదలైన మాటలు ఆయన లిస్టులోనుంచి జారిపోయాయి.

ఈ విధంగా భారతీయ భాషాప్రభావంమీద తగిన శ్రద్ధ లేకుండానే దాన్ని గురించి ఒక నిర్ణయానికి వచ్చినవారిని వదిలివేసి [3] oed ని మనం ప్రమాణంగా తీసుకున్నట్లయితే మనకు రమారమి ఆంగ్లంలో భారతీయ పదాలు 900 వరకూ కన్పిస్తాయి. ఇవీ ఈ పదాలకు కూర్పులూ, చేర్పులూ, మినహాయింపులూ మరెన్నో!

అయితే మన భాషలమీద ఇంగ్లీషు ప్రభావాన్ని గనక లెక్కలోకి తీసుకున్నట్లయితే, ఆంగ్లభాషపై భారతీయ భాషాప్రభావం చాలా తక్కువే. ఒక్క తెలుగులోనే మనం అనునిత్యం మాట్లాడుతున్న మాటల్లోనే దాదాపు 3000 పదాలుండగా, భారతీయ భాషల పదాలన్నింటినీ కలుపుకున్నా, ఆంగ్లంలో, పైన యిచ్చిన సంఖ్యకు సగానికన్నా మించలేదు.

ఈ విధంగా, ఆంగ్ల పదాలు మన భాషల్లో విరివిగా కన్పించటానికీ, భారతీయ పదాలు ఇంగ్లీషులో తగినంత ప్రాతినిధ్యం పొందలేక పోవడానికీ ఎన్నో కారణాలున్నాయి. ఆంగ్లేయులు ఎన్నడూ కూడా ఈ దేశాన్ని తమ జన్మస్థలంగా భావించలేదు. పైగా ఇక్కడి ఆచార వ్యవహారాలు వారికి అత్యంత వ్యతిరేకం. స్వకార్యం నిమిత్తం ఈ దేశానికి వచ్చిన వారైనా తిరిగి తమ తమ జన్మస్థలాలకు వెళుతూ వెళుతూ ఏవో నాలుగు మాటలు మాత్రం గుర్తుంచుకుని

---

1 History of Foreign words in English అన్న గ్రంథములో

2 Concise Oxford Dictionary

3. Oxford English Dictionary

పదజాలాన్ని ఏలా ఉపయోగించారో తెలుసు కుందాం.

## 3

మాటలచేత మహిమలను మన్నన లందగలమన్న అన్నది ఆనాటి సంగతి అయితే, మాటల వ్యాకరణం చేత, మాటలలోని మార్పులవల్ల, చరిత్రకందని కొంద రిని గురించి తెలుసుకోవచ్చునన్నది ఈనాటి విశేషం. 'మాటలే' ఆర్థిక విప్లవాన్ని వివరిస్తాయి. 'మాటలే' సాంఘిక స్థితిగతుల్ని బోధిస్తాయి. ఆ 'మాటలే' చిరంతన సంస్కృతిని, నాగరికతనూ తెలియ జేస్తాయి.

## 1600 నుండి 1700 వరకు

ఆంగ్లంలోకి ప్రవేశించిన భారతీయ పదాలను శతాబ్దాల వారీగా పరిశీలిస్తే ఇదే సంగతి తేటతెల్ల మౌతుంది. మొదటగా పదహేడవ శతాబ్దాన్ని పరి శీలిద్దాం.

ఈ శతాబ్దంలో తీసుకున్న మాటలు ప్రాథమికంగా వ్యాపారానికి సంబంధించినవేని వాడారు అన్నీ వస్తువుల పేర్లే. ఉదా: క్యాలికో, చుద్దార్, టస్సార్, బంగాల్ (ఇదివరలో ఒక రకపు వస్త్రాలను బంగాల్ అని పిలిచేవాళ్ళు), గుంగారి (చాలా తక్కువ రకా నికి చెందిన గుడ్డను 'గుంగారీ' అని పిలిచేవాళ్ళు. ఈ గుడ్డతో ట్రౌజర్లు కుట్టించుకొన్నారు. ఇటువంటివే ఇంకా చాలా మాటలు వున్నాయి. అయితే ఈ మాటలన్నీ కూడా వాడుకలో లేకుండా పోయాయి, కాల గర్భంలో కలిసిపోయాయి. చనిపోకుండా బ్రతికి వున్న మాటల్లో 'క్యాలికో' అన్న దానికి చక్కటి చరిత్ర వుంది.

## క్యాలికో

16వ శతాబ్దంలో ఇది "కల్లికట్, కలికో" అని పిలువబడేది. ఆతర్వాత పోర్చుగీసు, ఫ్రెంచి భాషల ప్రభావానికి లోనయింది. అసలు ఆ కాలంలో గోవా తర్వాత చాలా పెద్ద ఓడరేవు అయిన క్యాలికట్ నుంచి వచ్చే తెల్లని వస్త్రానికి, దీనికి కొంత సామ్యం వుంది. ఇటువంటి, భౌగోళికమైన మాటలను వస్తువులకు వాడుకునే సౌలభ్యాన్ని భారతదేశం ఇంగ్లాండుకు అధికంగా కల్గించింది. ఉదా: "డుంగార్, సూరత్, బెంగాల్, మద్రాస్, మలబార్, జోధ్ పూర్, 'జాకోనెట్' " 'క్యాలికో' అన్నమాట ఎంత వాడుకలోకి వచ్చిందంటే, సామాన్యంగా చిరుతిండి చేసుకున్న ప్రతి మామూలుబట్టను ఇదే పేరుపెట్టి పిలిచేవా రాకాలంలో పాశ్చాత్యుల్లు. తర్వాత, తర్వాత ఇది "చాలా చల్లని, పలచని గుడ్డ" అని పేరు సంపాయించుకొంది. పాశ్చాత్యుల్ల కావ్యరచయితల్లో ఒక కావ్యరచయితకు "క్యాలికో బాల్" అని పేరు. అక్కడ అన్నట్లు కావ్యం చేసే వాళ్ళందరూ కూడా మామూలుసైజు మాత్రమే కట్టుకు వచ్చేవారట! అమెరికాలో "ముద్రింపబడిన మామూలుగుడ్డ"కు క్యాలికో అని పేరు. అమెరికన్ విద్యార్థి దృష్టిలో "A choice bit of Calico" అంటే అమ్మాయి అని అర్థం. ఆ ధంగానే సూరత్ అంటే 'చాలా తక్కువ రకానికి చెందిన గుడ్డ' అన్న భావం స్థిరపడింది.

ఈ శతాబ్దానికి చెందిన వ్యాపార వస్తువుల పేర్లలో "ఆరాకా, కాయిర్, కుసుంబాగి (తెలుగు కుసుంభాగం), పెప్పర్, సుగర్" అన్నవి కొన్ని. పెప్పర్, సుగర్ అన్నమాటలు ఇంతకు చాలాకాలం క్రితమే, గ్రీకు, లాటిన్ల ద్వారా, ఆంగ్లంలోనికి వచ్చివుండటం.

ఇటువంటివే మరికొన్ని మాటలు: "గుణాక్షీ, కూలీ, బజార్, గూడీ, షైపా, మొహార్, పగోడా (గోలాకారంలో అప్పట్లో వాడుకలో వున్న ఒక నాణెం), దినార్, పణమ్, షుక్; మాండ్, బెన్; సేర్, తూ."

ఈ శతాబ్దంలోనే మరొక్క విశేషం, 1690 95 నాటికల్లా పోర్చుగీసులు పశ్చిమతీరాన అంతటా స్థావరాలు ఏర్పరచుకుని బాగా స్థిరపడ్డారు. అదీగాక, భారత-పోర్చుగీస్ దేశీయుల సాహచర్యం వల్ల "ఇండో-పోర్చుగీస్" మాటలు కొన్ని ఉద్భవించాయి. ఆ తర్వాత వచ్చిన ఆంగ్లేయులకు కూడా పోర్చుగీసు వారవలంబించినపద్ధతే తామూ అవలం బించక తప్పలేదు.

డాక్టర్ డాల్గాడో అభిప్రాయం ప్రకారం ఈ సమయంలోనే 300 మలయాళీ పదాలు పోర్చుగీసు ద్వారా ఇంగ్లీషులోకి ప్రవేశించినవి. అయితే అందులో చాలా పదాలను ఇప్పుడు కాలమనే మహా సర్పం మింగివేసిందనుకోండి. అల్లా మింగివేయబడ

ఉండా కొన రూపాంతరంతో ప్రవేశించిన పదాలలో 'తోపాసి' అన్నదొకటి. దీని అర్థం సైనికుడు గానవచ్చు లేక ఓడలో పనిచేసే పాకీవాడు కావచ్చు లేక భారతదేశంలో పోర్చుగీసువారి సంతానం కావచ్చు. ఏమైనా మన హిందూ "దుబాషీ" పదానికి, దీనికి కొంత సామ్యం వుంది. ఇంగ్లీషు - పోర్చుగీసువారు మొదట్లో ఈ దుబాషీలు (Translaters) గా పనిచేసేవారని దీన్నిబట్టి తెలుస్తోంది

సంప్రాప్తమైన చరిత్రకుల మరొకమాట "ఫెరింగీ" భారతీయులు మొదట్లో పోర్చుగీసువారిని ఫెరింగీ లని పిలిచేవారు. తర్వాత తర్వాత పాశ్చాత్యులందరికీ ఈ పదమే వర్తించింది. కానీ ఈ పదం అసలు ఎలా పుట్టిందో మాత్రం ఊహాకందకుండా వుంది. బహుశా '(ఫ్రాంక్' అన్న పదం 'వికృతిచెంది ఫిరంగి అయిందేమో!' యూరోపు దేశీయుల నందరనూ కూడా భారతీయులు మొదట్లో '(ఫ్రాంక్స్' అని పిలిచేవారు. ఎందుకంటే ఫ్రెంచివారు చేసిన యుద్ధాలే భారతీయుల స్మృతిపథంలో నిల్చిపోయి యూరోపియనులు అంటే ఫ్రెంచివారు అనే దృష్టి ఏర్పడిపోయింది. ఆ ఫ్రెంచివారే ఫ్రాంకులయి, ఆ ఫ్రాంకులే ఫిరంగీలయినారు. ఆ పిదప పోర్చుగీసువారు తమ మతప్రచారానికై చేసిన దుస్తంత్రాలు, గుస్తయాల యూరంగా, వారు క్రిస్టియనులు కావడంచేత, ఫిరంగీ అంటే పోలికగా క్రిస్టియన్ అనే అర్థం వచ్చింది. ద్రావిడ వాఙ్మయంలో 'ఫిరంగి' అంటే "యుద్ధాల్లో ఉపాకీ మందుగుండు కాల్చే ఒక మారణసాధనం" అనే అర్థం కూడా వుంది "పిస్టల్, ఆరక్, కాయిన్, తొప్రా" మొదలైన వన్నీ ఇటువంటి మరికొన్ని మాటలే మాటల చేత చరిత్రను తెలుసుకోవచ్చు అన్న నిర్ణయానికి సహాయకారులు "మొగల్, మున్షీ, సుబాహ్దా, దుబాషీ" మొదలైన పదాలు

17వ శతాబ్దంలో మొగలు రాజకీయం ధగద్ధగాయమానంగా వెలుగుతున్నది. ఆ సొగసులు, ఆ దర్బారులు, ఆ వైభవం, చూసివచ్చిన పాశ్చాత్యుల కళ్ళకు మిరుమిట్లు గొల్పెను. 1583 లో అక్బరు చక్రవర్తి ఆస్థానానికి ఎలిజబెత్ రాణి జాన్ న్యూబెరీని తన ప్రతినిధిగా పంపింది. అప్పుడే "మొగల్" అన్న పదం "గణనీయమైన శక్తి, స్వేచ్ఛాతంత్రుడైన చక్రవర్తి" అన్న అర్థాన్ని సంపాయించుకుంది. "ఫర్మానా" కూడా అటువంటిదే. మొగలు సామ్రాజ్యాల ఆపాతానికి తెల్లవారి రాకపోకలు అత్యంతరహితంగా యథేచ్ఛగా సాగిపోతుండేవి. సూరత్‌లో మొట్టమొదటిసారిగా ఆంగ్లేయులు తమ ఈస్టిండియా కంపెనీని స్థాపించుకోటానికి, బలపరచుకొని తమ ప్రాభవాన్ని పెంపొందించుకోటానికి, ఉదారహృదయులైన ఆ ఢిల్లీశ్వరులు "ఫర్మానా"లు జారీ చేస్తుండేవారు

మొదటే మంచి చేశారు. ఆంగ్లేయుల జీవన విధానానికి, మన జీవనవిధానానికి వారి సంస్కృతికి మన సంస్కృతికి చాలినంత భేదమున్నది. ఈ భేదాన్ని అంచెలంచెలుగా అధిగమించటానికి "దుబాషీలు, మున్షీలు, సుబాహ్దాలు" అవసరమైనారు ఆంగ్లేయులకు. ఇటువంటిదే తెలుగుమాట "భోయీ" (Boy) కూడా పల్లకీలు మోసేవారిని తెలుగులో 'భోయీ' లని పిలుస్తుంటారు. ఆ భోయీ, చివరకు బోయ్ అయింది. అర్థం మారింది. "పక్కీ, డోగీ, రాజా, మహాల్, పాలంకీన్ ధోవీ, మ్యాంగో, బన్యన్, టేక్, సంబూర్, నవాబ్" ఇవన్నీ అప్పట్లో ఆంగ్లేయులకు క్రొత్తగా పరిచయమైన పదాలు

ఈ పదునేడవ శతాబ్దంలో ఆంగ్లేయులు భారతీయులకు సమానప్రతిపత్తి నిచ్చి గౌరవంతో, ఆదరంతో సందర్శించారు. భారతీయ జీవనవిధానాన్ని తెలుసుకోవడానికి ఎంతో ఆసక్తి చూపించారు. హిందూమతాన్ని, హిందువుల దైవభక్తిని ఖండించలేదు. హిందూ ముస్లిము పండుగలు—"హోళీ, దివాళీ, మొహరం, రామదాన్"—లను తామూ తమ భావాలలో చేర్చుకున్నారు. భోజనంలో వస్త్రధారణంలో భారతీయుల అనుకరించారు. "బన్యన్ షర్ట్స్, లాంగ్ డ్రాయర్స్, కాంగీక్యాప్స్, బన్యన్‌కోట్స్, మూర్ మెన్స్ ట్రౌజర్స్" ఉండేవి ఆ రోజుల్లో.

## 1700 నుండి 1800 వరకు

పదునెనిమిదవ శతాబ్దంలో ఆంగ్లంలోకి ఎక్కువ చేరిన మాటలు క్రిందటి శతాబ్దంలో వాటికన్నా చాలా తక్కువ. అదికాక తీసుకున్న మాటలకే కూర్పులూ, చేర్పులూ, మినహాయింపులూ చేసి అనేక క్రొత్త మాటలు సృష్టించారు. ఆ తరువాత ఈ శతాబ్దంలో, పూర్వార్థంలో 20 మాటలు మాత్రమే ఇంగ్లీషులోకి ప్రవేశించగలిగితే అదే శతాబ్దం ఉత్తరార్థభాగంలో 140 దాకా ప్రవేశార్హతను సంపాదించగలిగాయి.

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

1750 ప్రాంతాలవరకూ కూడా ఆంగ్లేయులు తమ వర్తకంమీదనే బాగా దృష్టి వుంచారు. యుద్ధాల జోలికి బాగా పోలేదు. అందుచేత వ్యాపారానికి కావలసిన మాటలను ఇదివరకే తీసుకుని వుండటంచేత వారికి క్రొత్త మాటలు తెచ్చుకోవలసిన అవసరం లేకపోయింది. ఏవో కొద్ది మాటలు "కాట్, బంగళా, కొర్నిమార్, దస్తూక్" లాంటివి మాత్రమే తీసుకోబడ్డాయి.

అయితే తీసుకోబడ్డ మాటలు విశేషార్థాలతోనూ చేర్పులూ మార్పులతోనూ, కొన్ని కొన్ని పదసమూల మిశ్రమాయింపులలోనూ విశేషంగా వినియోగింపబడ్డాయి ఉదా "బెంగాల్ సిల్క్, మ్యాంగోబర్, పాగోడ్ గాడ్, ఇండియా పెప్పర్, నవాబ్ మేకర్, మహారాటాడిచ్, సిపాయ్, ఛిఫ్, ఇంసిహూక్రైస్, నవాబిజమ్, నవాబ్ షిప్"

కానీ, వ్యాపార పదాలు ఈ శతాబ్దంలో ఎంత తక్కువగా వున్నాయో, రాజకీయ సైనిక పదాలు అంత ఎక్కువ వచ్చాయి. "సిపాయ్, సిబ్బంది, తెలింగా, రిసాలాహ్, లూటీవాలా, దివానీ" వంటివి ఈ రకానికి చెందినవి. ఈ విధంగా సైనిక పదాలు వృద్ధి కావటం, ఆంగ్లేయులు భారతీయుల మధ్యగల సంబంధాలు ఏ స్థితిలో వున్నాయో విశదీకరిస్తుంది. మొదట్లో ఆంగ్లేయులకు ఆంగ్ల సిపాయీలే ఎక్కువగా వుండేవారు. కానీ చివరకు ఈ ఆంగ్ల సిపాయీలే చిన్నరకం రాజకుమారుల్లాగా సంచరించడంతో సుబేదార్లతో, హావల్దార్లతో, జమేదార్లతో, నాయిక్ లతో భారతీయ దళాలు ఏర్పడ్డాయి. ఈ శతాబ్దంలోనే విచిత్రమైన క్రొత్త పదాలు రెండు జన్మించాయి. 1 బ్లాక్ హోల్, 2 వాచ్ బ్లాక్ హోల్ ఆఫ్ కలకటా శుద్ధ అబద్ధమైనా ఆ పదం ఎంత సంచలనాన్ని, దుమారాన్ని కల్గించవలెనో అంతటిని కల్గించింది. జనానాలో ఘోషా స్త్రీల ఆనందం నిమిత్తమై "నాచ్" ప్రవేశపెట్టబడింది ఇటువంటి జాతికి చెందిన పదాలే "చిలుం, ముక్కా, ఖేదా"లు.

## 1800 నుండి 1900 వరకు

ఈ శతాబ్దంలో పదాల ఎగుమతి దిగుమతుల వ్యాపారం బాగా ఎక్కువైంది క్రిందటి శతాబ్దం కన్నా, తామర తంపరగా మాటలకు మాటలు పుట్టి కాకుండా సరాసరి సంస్కృతంనుంచే అభివృద్ధి అయినాయి. ఈ శతాబ్దంలోనే మొట్టమొదటి సారిగా "ఇండో-యూరోపియన్" అన్న శబ్దం వినబడింది ఈ శతాబ్దంలో మరొక్క విశేషం ఏమిటంటే, గతంలోలాగా కాకుండా, సరాసరి సంస్కృతంనుంచే అనేకపదాలు గ్రహించబడ్డాయి. "ఉదా సంధి, గుణ, స్వరభక్తి దేవనాగరి" ఇత్యాది ఇంత వరకూ భాషా విజ్ఞానానికి చెందిన పదజాలమే విశేషంగా ఆంగ్లంలోకి తీసుకోబడింది కాని ఈ శతాబ్దంలో భారతీయ వేదాంతశాస్త్రం నుంచి ప్రాముఖ్యాన్ని సంపాయించుకొంది భారతీయసంస్కృతి, వాఙ్మయం, హిందూమతం తదితర పదజాలాన్ని ఆంగ్లానికి దత్తత చేసినది "బ్రాహ్మణ" అన్న శబ్దానికి వచేల సంతతి కలిగింది "ఉదా: బ్రాహ్మనిక్ ఫిలాసఫీ, బ్రాహ్మనికల్, బ్రాహ్మణి-కిగ్-బ్ర

18వ శతాబ్దం చివరి భాగంలో "వేద, రిగ్వేద, అవతార్, గుర, తంత్ర," లాంటి పదాలు, 19వ శతాబ్దంలో "యోగ, అమృత, భక్తి స్థూప, బుద్ధిజం, కర్మ, దేవ, మహాత్మ, మేళా, పూజా, సంహిత, సంస్కార, ఉపనిషత్, నిర్వాణ" లాంటి పదాలు ఆంగ్లానికి బలాన్ని చేకూర్చాయి. ఇట్లా చేరి, తమ భావకు పుష్టి కలిందడాన్ని ఓవన్ బార్ఫీల్డ్ మున్నగు వారెందరో సమర్థించారు అయినా "కర్మ, కర్మ, మాయ" ఇత్యాదికి ఆంగ్లంలో సరియైన అర్థాన్ని చెప్పే మరో పదాలేవీ వారు సమర్థించవలె లేక వింత కాదు

ఇంక సిపాయీలయుద్ధం, అఫ్ఘన్‌యుద్ధం సిపాయి తిరుగుబాట్లు మరికొన్ని పదాలను చేర్చినవి ఇంగ్లీషులోకి ఉదా: "ఖుక్రి, జెజైల్, పాండి, చుపట్టి, లోటా, ఘంటీగార్" వంటివి ఆదిగాక పైతరగతికి చెందని పదాలు—బంగీ, పచిసి, తమాషా, బంగారుపూ హాలాలూక్, తూన్—అనేకం.

## ఇరవయ్యో శతాబ్దం

ఈ శతాబ్దంలో, ముఖ్యంగా భారతస్వాతంత్ర్య సమరం, ఇంగ్లీషులో మన పదాలు చేరడానికి చాలా వరకు తోడ్పడం చేసింది. ప్రథమ ద్వితీయ ప్రపంచ సంగ్రామాలు "అర్కీస్టాంగ్" ఏర్పడడానికి కారణము లయ్యాయి "పోకాచీ, చర్, చెలో, అచ్ఛుంగ్,

డెకో, గన్‌వాలా" కొత్తగా పుట్టిన పదాలలో కొన్ని మాత్రమే. శకు మహాత్ముని ఉద్యమం "అహింస"కు ప్రచారాన్నిచ్చింది

ఆ తర్వాత హిందూ మహమ్మదీయుల కలహాలు, పాకిస్తాన్ అవతరణం "పాకిస్తాన్ పాకిస్తానైజేషన్, గూండా, గూండాయిజమ్" మొదలయిన మాటలను అందరికీ తెలియజెబుతాయి

ఏమైనా భారతదేశం రిపబ్లిక్ గా అవతరించడంతో, ఎటువంటి మార్పులు భారతాంగ్ల భాషల మధ్య కలుగుతాయో చెప్పడం కష్టం. కాని ఇప్పుడు ఈ రెండు దేశాలమధ్య వున్నటువంటి సుహృద్భావమే గనక కలకాలం నిలిచివున్నట్లయితే, భారత భాషలు ఆంగ్ల భాషా సంపర్కంతో అభివృద్ధి పొందగలవనీ, భారత భాషల సంపర్కంతో ఆంగ్లభాష కూడా మూడు పూవులూ ఆరు కాయలూ కాయగలదనీ మాత్రం మనం నిస్సంశయంగా ఆశించవచ్చు

## 4

ఇంతవరకూ ఆంధ్ర, తమిళ, మళయాళీ, గుజరాతీ, నేపాలీ, హిందుస్తానీ పదాలు ఏ కారణాల చేత, ఎన్నిగ కాలంగా ఆంగ్లంలోకి తీసుకోబడ్డాయో అన్న విషయాన్ని గూర్చి తెలుసుకున్నాం. ఈ వ్యాసభాగంలో తీసుకోబడిన పదాలు ఎట్టిమార్పులకు గురి అయిందీ, ఈ మార్పులు చేయడంలో ఏదైనా పద్ధతి అవలంబింపబడిందా, లేదా అన్న విషయాలను గురించి తెలుసుకుందాం

విలియం హాకిన్స Pattans Psthans Ras. bootes Rajputs అనీ, సర్ థామస్ రో Cytore Chittore Umbras Omrahs అనీ, జాన్ ఫ్రయర్ Medapollon Madhavapalem. Shawjhan Shabjehan అనీ ఈ విధంగా విదేశయాత్రికుల వాడిన పదాలలో 'స్పెల్లింగులో' భేద ముండడానికి కారణం వారికి భారతీయ భాషలనుగురించి సమగ్రమైన జ్ఞానం లేకపోవడమే. అయితే విదేశయాత్రికుల భారతదేశాన్ని గూర్చి పరాయివారల ముఖతః వినడమే కాని, ప్రత్యక్షంగా ఈ దేశాన్ని చూచి, ఇక్కడి పరిస్థితులను గమనించినవారు కారు. అయితే పర్షియన్, హిందూస్థాన్ భాషలను క్షుణ్ణంగా నేర్చుకున్న థామస్ కోర్‌యాట్, జాన్ మిల్డెన్ హాల్ వంటివారు లేకపోలేదు. కాని వారు చాలా తక్కువ.

కాని 19వ శతాబ్దంవచ్చేసరికి పరిస్థితులు కొంచెం మారుపడ్డాయి. భారతదేశం ఇంగ్లండు ఆధిపత్యం క్రిందకు రావడంతో బహుళ సంఖ్యలో ఆంగ్లేయులు ఈ దేశానికి రావడమూ, ఇక్కడ భారతప్రజలనూ, వారిభాషలనుగూర్చి సమగ్రపరిశీలన చేయడమూ జరిగింది ఇంతవరకు ఉచ్చారణ (Pronounciation) కే ప్రాముఖ్యం యిచ్చినవారల్లా ఇప్పుడు 'స్పెలింగు' కు కూడా ప్రాముఖ్యం యివ్వడం ప్రారంభించారు. సర్ విలియం జోన్సు వంటి పెద్దలు ఈ మార్పుకోసం బాగా కృషి చేశారు. అయితే అక్కడక్కడా కొందరు తెలివి తక్కువవారు లేకపోలేదు "బుద్ధ అనేవారు బుద్ధ అనడానికి; బాబర్ అనడానికి భాబర్ "

అయితే ఇరవయ్యో శతాబ్దం వచ్చేసరికి The Society for pure English వారు, దిగుమతి చేసుకున్న మాటలకు పరిపూర్ణ ప్రతిపత్తి నిచ్చి, రూపకల్పన చేయడంలో మంచి కృషి చేశారు. పైగా భారతీయపదాలు కూడా పెద్ద మార్పేమీ లేకుండానే, ఆంగ్ల వ్యాకరణ చట్టంలోకి ఇమిడిపోయాయి. కాని ఆ యా పదాలకు "ఫలానా నామవాచకం, ఫలానిది క్రియ" అని చెప్పడంలోనే కొంచెం కష్టమైంది.

సాధారణంగా ఏ భాషలోనైనా నామవాచకాలే ఎక్కువగా వుంటాయి. ముఖ్యంగా, హిందీ, ఉర్దూవంటి భాషల్లో నామవాచకాలు పుంలింగాలుగానో, స్త్రీలింగాలుగానో వుంటాయి. ఆ విధంగానే "కోటి" స్త్రీలింగమయితే, "చా" పుంలింగం— "తమాషా" పుంలింగమయితే "చిట్టీ" స్త్రీలింగం. కాని ఆంగ్లంలో, పదాలకు వాటివాటి అర్థాన్నిబట్టి మాత్రమే, లింగనిర్ణయం చేశారు.

ఆంగ్లంలోకి విశేషణాలు కూడా బాగానే తీసుకోబడ్డాయి. ఉదా: బెంగాలీ మాటలు, కచ్చా, పక్కా

కాని క్రియాపదాలను గ్రహించడం మాత్రం అంత సులభంగా జరిగింది కాదు. కొన్ని కొన్ని నామవాచకాలకు . "—Age; - dom; - ism" చివర చేర్చారు. ఉదా: డకాయిటేజ్; బాబూడమ్; బ్రాహ్మనిజమ్; ఇత్యాది.

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

క్రియాపదాలను చివరన ing చేర్చారు ఉదా: బాటింగ్, బలాయింగ్.

కొన్నిచోట్ల క్రియలనే నామవాచకాలుగా ఉపయోగించారు. ఉదా: పూంఘూ దేర్. మరి కొన్నిచోట్ల నామవాచకాలనే క్రియలుగా ఉపయోగించారు ఉదా: నాచ్, ఠంకా, టామ్ టామ్

మరికొన్ని, విస్తృతమైన అర్థాంతరాన్ని పొందగలిగినాయి ఉదాహరణకు 'అనకొండ' అన్న పదాన్ని తీసుకోవచ్చు మొదట్లో సింహళంలో ఒక పెద్ద పామును "అనకొండ" అనేవారు కానీ రాను రాను ఏపామైనా సరే, తన కందిన ఆహారాన్ని వదిలిపెట్టకుండా దూర్చం దూర్చం చేసుకోగలది వున్నట్లయితే, దాన్ని 'అనకొండ' అని పిలవటం ప్రారంభించారు ఇలాగే విస్తృతపర్చబడిన అర్థలతో "బండికూట్ (తెలుగు పంది కొక్కు), బంగాళా, ఫకీర్, కోహినూర్, ఖర్వ్" మొదలైన పదాలు వాడబడుతున్నాయి

మరికొన్నిచోట్ల, పదాలయొక్క అర్థం సంకుచితం చేయబడింది "వకీల్, బాబూ, కాలికో" మొదలైన పదాల అర్థం ఇలా సంకుచితం కావటానికి లోనయింది.

మరికొన్ని సందర్భాల్లో కొన్ని కొన్ని పదాలు తమ పూర్వపు అర్థాన్ని కోల్పోవటంకూడా జరిగింది "ఉదా బీటల్ నట్, కూలీ, గాడీ, జంగిల్, లూట్, ప్యాంగ్" మొదలయినవి

ఏమైనా ఇటువంటి పరిణామాలన్నీ కూడా సజీవమైన భాషలో జరుగుతూనే వుంటాయి ఇంగ్లీషునుంచి తెలుగులోకి దిగుమతి చేసుకోబడిన పదాలకు కూడా ఇదే గతి సంభవించింది అది సహజంకూడా!

## 5

ఈ వ్యాసం మొదట్లో మనవిచేసినట్లుగా, కొన్ని క్రొత్త పదాలు ఒక భాషలో చేరినప్పుడు, ఆ పదాలు బాగా వ్యాప్తిలోకి రావాలి అంటే, ఏతద్భాషలోని రచయితలే ప్రముఖపాత్ర వహించాలి. ఆ పదాలకు బాగా ఆదరణ వ్యాప్తి తెలపాలి, క్రమేణా నిత్య జీవితంలాగా అవి కలిసిపోతాయి

అయితే ఆంగ్లరచయితలుమాత్రం స్వపరభేదాన్ని పాటించకుండా, అవసరమైనప్పుడెల్లా విదేశీపదాలు వాడేవారు వాడుతున్నారు ప్రతిపదానికీ ఒక క్రొత్త సౌరభాన్నీ ఒక క్రొత్తదృష్టినీ ఇచ్చారు ఆంగ్లవాఙ్మయంలో దిగ్గంతులైనవారిచేత ఈపదాలు వాడబడటంచేత, అది ఆ కవిపుంగవుల పదకోశాలలోపాటు నిలిచిపోయే తమతమ గ్రంథాల్లో ఈ పదాలను ఉపయోగించటంచేత, ఆంగ్లభాషాప్రవాహంలోకి ప్రవహించిన భారతీయ పదజాలం చెక్కుచెదరక నిలిచివుండగలదని మనం ధైర్యంగా చెప్పవచ్చు

ఈస్టిండియా కంపెనీ భారతదేశానికి రాకపూర్వమే, భారతీయపదాలు కొన్ని, ఆంగ్లకవులచేత స్వీకరింపబడాయి ఉదా —అల్లం, బెరిల్, జింజర్, రైస్, సుగర్, పెప్పర్ —ఈ మాటలన్నీ కూడా గ్రీకు లాటిన్ ఫ్రెంచిభాషలద్వారా ఆంగ్లంలోకి ప్రవేశించాయి ఆంగ్లకవుల రచనలనుంచి ఒక్కటొక్కటిగా ఉదాహరిస్తాను

చాసర్ The Hous of Fame 1 1288 'Walles of berile'

మార్లో 'సుగర్' అన్న పదాన్ని ఉపయోగించాడు డిటో, II 1 600 'రైస్' అన్న పదాన్ని కూడా ఇతనే మొటగా ఉపయోగించాడు rice porridge, The Jew of Malta III IV. 1368

షేక్స్పియర్ 'పెప్పర్' అన్న మాట నుపయోగించాడు 'pepper-ginger bread' Henry IV III 1 260, 'pepper Corn Henry IV III III 9 [1]క్రియగా కూడా అతనీమాట నుపయోగించాడు

ఇన్ని పదాలను గురించి మనం ముచ్చటించుకొంటున్నాంగాని, హిందూదేశానికి 'ఇండియా' అన్న పేరెలా వచ్చిందో మనం చర్చించలేదు పాకిస్తాన్ లాగా, హిందూస్థాన్ అని మనం ఇప్పుడు పిల్చుకొంటున్నా పాశ్చాత్యులందరూ కూడా 'ఇండియా' అనే భారతదేశాన్ని పిలుస్తున్నారు ఇండియా అన్నపదం సంస్కృతి 'సింధు' పదంగా వచ్చింది సంస్కృతం నుండి పర్షియాకు, అటుపై గ్రీక్, అక్కడనుండి లాటిన్, అక్కడనుండి ఆంగ్లంలోకి ప్రవేశించింది ఓల్డ్ ఇంగ్లీషులో "ఇండియా, ఇండియాస్, ఇండిస్క్" అన్న మాటలు కన్పిస్తున్నాయి కానీ 1200 1600 కాలంలో ఇండియా అన్నమాటపోయి "ఇండే, ఇండె, ఇండ్" అన్నమాటలు వ్యాప్తి చెందాయి. చాసర్ 'ఇండే' అన్న పదాన్ని ఉపయోగించాడు స్పెన్సరు కూడా అదేదాన్ని స్వీకరించాడు అయితే ఒక్కచోట మాత్రం [2]"ఇండియా" అన్నమాట పెల్లాగో అతనుపయోగించటం జరిగింది అతనుపరి తూర్పు పశ్చిమ ఇండీయా దీవుల మూలంగా ఈమాట మరింత వ్యాప్తిలోకి వచ్చింది. మిల్టన్ మహాకవి కొటన్ వ్రాసిన సందర్భంలో మొగల్ ప్రస్తావన తీసుకువచ్చాడు[3]

---

1 "I am pepper'd, I warrant for this world" Romeo & Juliet III 1 104

2 The Faerie Queene II 72,5

3. Paaradise Lost. II 1 4

"బెంగాలా, పెర్కాన్, మలబార్, ఆగ్రా, లాహోర్, గోలకొండ, ఇండస్, హైడాస్పస్ (జీలం నది)"[2] మొదలైన పేర్లు ఉపయోగించాడు.

ఇంక 'ఇండియన్' అన్న పదాన్ని మొట్టమొదట సరిగా ఉపయోగించే గౌరవం డ్రైడన్‌కు దక్కింది 1 అగ్గాక అతను ఔరంగజేబుతో వ్రాసిన నాటకం మొకటి పంపెనే వుంది

18వ శతాబ్దంలో, తిరువాన్కూర్‌లో పుట్టి, తమయాకర ప్రథమార్ధంలో ఇక్కడ ఉద్యోగం చేసిన రాబర్ట్ ఆర్మ్, ఎడ్మండ్ బర్క్ లిద్దరూ ఎంతగానో భారతీయ పదజాలా న్నాదరించారు ఒకరు ఈ దేశ వాసులతో కలిసి మెలిసి ఇక్కడి భాషా సౌంధా న్నాఘ్రాణిస్తే, మరొకరు అసలు లేకుండానే, విదేశంలో వుండికూడా దక్కటి విమర్శనా జ్ఞానంతో, తప్పటడుగు వేయకుండా భారతీయ పదాలమీద స్వారిచేశాడు

డేనియల్ డీఫో పోప్, వాల్పోల్, స్మాలెట్ మొదలయిన వారంతా ఎక్కడో అక్కడ ఏదో ఒక సందర్భంలో భారతీయ పదాన్ని వాడేవున్నారు

పదునెనిమిదవ శతాబ్దం చివరి భాగానికల్లా మహాపండితులైన "సర్ ఛార్లెస్ విల్కిన్సు, నథానియల్ హాల్ హెడ్, అలెగ్జాండర్ డౌ, సర్ విలియం జోన్సు, అలెగ్జాండర్ హామిల్టన్" ప్రభృతులంతా ఇండియన్ వ్యవహారాలమీద పుస్తకాలు వ్రాసి, భారతీయ భాషల నాదరించి, అందలి పదాలతో తమ సాహిత్యాన్ని కలింపుకొన్నారు ఏ తప్పూ లేకుండా వాడారు

ఇహ పందొమ్మిదవ శతాబ్దంలో నవలా రచయితలూ, విమర్శకులూ, కవులూ, చరిత్రకారులూ, యావన్మంది భారతీయ భాషల సౌష్ఠవాన్ని గుర్తించి, ఆయా పదాలను వాడుకొన్నారు

స్కాట్, సథే, బైరన్, మెకాలే, థాకరే, కిప్లింగ్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్, సర్ జి ఓ ట్రెవల్యాన్, జేన్ ఆస్టిన్, టి యస్ ఇలియట్ ఇలా ఎంతమందినైనా చెప్పవచ్చు వారు వాడిన పదాల జాబితాలో నుండి "పరియాన్ జో, అమృత, విగా, హిందూస్తానిష్, ధగ్, పకీర్, పంకా, ఫకీర్"లాంటి వాటి నెన్నైనా చూపించవచ్చు

2సర్ వాల్టర్ స్కాట్ భారతదేశాన్ని గూర్చిన మొట్టమొదటి నవల వ్రాశాడు సథే హిందూ స్వర్గాలనూ, దేవతలనూ తనకావ్యాల్లో చిత్రించాడు 3

కాని కిప్లింగ్‌లాంటివారు హిందూదేశంమీద అభిమానంతో తమ తమ గ్రంథాల్లో వాడిన మాటలన్నీ కూడా సర్వజనములకూ ఆమోదయోగ్యం కాలేదు. చాలా మాటలు "నాలఖా, ఖైది, సాహిబా, జల్దీ, జాదూ" వంటివి వచ్చిపోయాయి

అయితే ఇరవయ్యో శతాబ్దంలో ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. ఆంగ్లేయులు మనదేశాన్ని గూర్చి, మన జీవనాన్ని గూర్చి కథావస్తువులు తీసుకుని ఆంగ్లంలో రచనలు చేయడానికి బదులు, భారతీయులే రవీంద్రులు చూపిన బాటలో, భారతీయ వైశిష్ట్యాన్ని యథాతథంగా చిత్రిస్తూ రచనలు సాగిస్తున్నారు

ప్రముఖ నవలారచయితలైన శ్రీ కె ఎ అబ్బాస్, డా ముల్కరాజ్ ఆనంద్, శ్రీ ఆర్ కె నారాయణ్ లాంటివారు చేస్తున్న కృషివలన ఆంగ్లానికి ఒక క్రొత్త జీవం వస్తున్నది అంతేగాక ఈ పత్రికల యుగంలో పత్రికా రచయితలు వహిస్తున్న పాత్ర మరీ ముఖ్యమైంది కావటంతో, ప్రముఖ పత్రికా రచయితలయిన శ్రీ కుందూరి ఈశ్వరదత్తు మొదలయినవారి ఉద్యమాలతో భారతదేశం ఆంగ్ల భాష అనే అద్దంలో తనను తాను సగర్వంగా చూచుకొంటున్నది

ఇదే పదికాలాలపాటు వర్ధిల్లాలి రాజకీయంగా జనపరిస్థితి ఎట్లున్నా భాషల సంపర్కంలో నైనా, ఒక క్రొత్త చైతన్యం పొందగలుగుతుంది అప్పుడే అటు ఆంగ్లమూ, ఇటు భారతదేశ భాషలూ వర్ధిల్లేది! తథాస్తు *

---

1 Marriage ala Mode IV 304
2 The Surgeon's Daughter
3 The Curse of Kehama

* ఈ నా వ్యాసరచనలో శ్రీ జి. సుబ్బారావుగారి Indian Word in English అన్న గ్రంథము చాలావరకూ తోడ్పడింది. ఇందుకు వారికి నా కృతజ్ఞతలు ఇంకా తోడ్పడిన గ్రంథాలు ఇవి

1 A Dictionary of American English on Historical principles

2 Daniel Jones' An English pronouncing Dictionary

3 H H Wilson A glossary of judicial and revenue terms and of useful words occurring in official documents relating to the administration of the Govt of British India.

# పిట్ట పోరు

ఏసు: (వచ్చి) మీరు పిల్చుకోడాను బాబుగారూ!

కాంచా: లేరావా స్నానంచెయ్యి ప్రొద్దెక్కింది. (నారాయణస్వామి లోనికెళుతూంటాడు. కాంచా రమ్మని అతనికేసి చూచి చూచి త్రిప్పుతుంది)

కాంచా: (నెమ్మదిగా) ఒరేయ్ ఏసుకొండలూ.

ఏసు: అమ్మా!

కాంచా: నేను అన్నయ్యతో పెళ్లివిషయం మాట్లాడ దానికొచ్చినట్లు ఆయనకు తెలిసినట్లుంది

ఏసు: అందుకేనేం తప్పుగోరూ మీరొచ్చింది?

కాంచా: ఉష్! నిమ్మళంగా మాట్లాడు వింటాడు. అంగుళకేలరా!

ఏసు: సరేలెండమ్మా.

కాంచా: వట్టి తింపులమారి మనిషి! మా అన్నయ్యే మనసిరచేస్తాడుకుమా!

ఏసు: నిత్తం

కాంచా: ఎలాగయినా తనకూతుర్ని మా సత్తిగాడి మెడకు తగిలించాలని చూస్తున్నాడు.

ఏసు. అవునండీ! వచ్చీరాంగానే అయ్యగారితో ఆ రావకోరకే మాటాడ్డారు.

కాంచా: (ఆదుర్దాగా) మాట్లాడాడూ? అన్నయ్యేమన్నాడు?

ఏసు: నాను సరిగా ఇనలేదుగానండి, పెత్తాలికయ్య గారు సరిగా సమాధానం సెప్పినట్టు లేరండి.

కాంచా: హమ్మయ్య! ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు: అమ్మా!

కాంచా: ఎవరెంత తన్నుకుచస్తేనేమాత్రం, నా అన్న నన్ను కాదంటాడ్రా?

ఏసు: ఎట్టాగంటారండి!

కాంచా: ఆయనెంత కాకమురిసయితే మాత్రం. అయినా ఇంతేం కాకమురిడిలే! మా వదినతో నే పోయింది వాళ్ళకూ మాకూ చుట్టరికం! ఏమం టావు?

ఏసు: (అయిష్టంగా) నిత్తం.

కాంచా: సరేగాని, బయటసంబంధాలేమయినా వస్తున్నయా?

ఏసు: అయ్యో! రాకపోటం కేంటండీ? సటారంగా! వొందలు! వొచ్చేపొయ్యేవాళ్లకి తెంపులేదంటే నమ్మండి!

కాంచా: మరి మా అన్నయ్యేమంటున్నాడు?

ఏసు: ఉలుక్కుండా పలుక్కుండా అట్టానే వుంటారు.

కాంచా: చూడు ఏసుకొండలూ! డబ్బున్నదంటే ఎవరికయినా ఆశ కలగొచ్చు. అందుకనే, ఏ నిమిషానికెలావుంటుందో, ఆ కొస్తమాట అది పిండుకోనే వదదామని వచ్చాను. ఏమంటావ్?

ఏసు: నిత్తం. మా పెద్ద మంచాలోచనండి

కాంచా: మనమ్మాయిని చూచావుగా నువ్వు? ఎలా వుంటుందంటావు

ఏసు: బుల్లెమ్మగోరి కేంటండీ? సినిమాతారలాగుం టారు!

కాంచా: మా సత్తిగాడికి తగిందేనంటావా?

ఏసు: ఎంతమాట! మాపమున్న బొమ్మయండీ జంట!

కాంచా: ఒరేయ్ ఏసుకొండలూ! నువ్వుకూడా మా అన్నయ్యకు నచ్చజెప్పాలిసుమా!

ఏసు: అంతకంటేనా అప్పమ్మగోరూ!

కాంచా: మా చెట్టునకోసిన జాంపళ్లు తెచ్చాను. నాలు క్కాయలిస్తాగాని తీసుకెళ్ళి పిల్లలకు పెట్టుకో

ఏసు: నిత్తం.

కాంచా: సరే, లోపలకెళదాం పదవ్. నారాయణయ్యకు నైవేద్యం పెట్టాలిగా మరి!

ఏసు: నిత్తం తప్పేదేంవుందండీ

(ఇద్దరూ లోనికెళుతూంటారు. రామానుజయ్య హడావుడిగా బయటనుండి వస్తాడు)

రామా: (బిగ్గరగా) ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు: నే నిక్కడే వుంటాను బాబూ!

రామా: బండొచ్చేటయమయ్యింది. వాళ్ళొస్తార్రా!

ఏసు: ఓరు బాబూ?

రామా: రెడ్డొచ్చి మొదలాడన్నట్టుంది! ప్రొద్దుట్నుండీ చెప్పిందేమిట్రా?

ఏసు: గెపితిలేదు బాబూ!

రామా: ఎందుకుంటుంది; వట్ల క్రొవ్వ్ తేసరి! మాధవయ్యగారొస్తారని చెప్పలేదట్రా?

రామా: మా అమ్మాయినిగురించి నే చెప్పబోవటం అంతగా బాగుండదనుకోండి—

పేర: ఫర్వాలేదు; సెలవివ్వండి.

రామా: నిజంగా మావాడు బుద్ధికి బృహస్పతి అంటే నమ్మండి.

పేర: చిత్తం ఊరు గొప్ప గోడలే చెబుతాయిగదండీ!

రామా: ఇక అందం విషయంలో ఆ విషయం నేను చెప్పదలచలేదు రండి కావాలంటే అమ్మాయిఫోటో ఇక్కడేవుంది.

పేర: అక్కర్లేదు కూడా. మిమ్మల్ని చూస్తే అమ్మాయి రూపం కళ్లల్లో మెదులుతోంది సుమండీ! ఆ బంగారు ఛాయ, ఆ విశాలమయిన నుదురు, చెంపకు చారెడేసి కళ్ళు ఆ ఒడ్డు పొడుగూ ఒహో!

రామా: (పొంగిపోయి) చూచినట్లుగానే వర్ణించారు.

పేర: మరేమి టనుకొన్నారు మన బుర్రంటే! కర్మ గాలి ఈరోజు ఈ స్థితి కొచ్చామనుగాని. చిన్నప్పుడు మా తాతగారంటుండే వారు— "ఒరే పేరినీడూ! ఈ తెలివి తేటలముందురాజులే కూడా పనికిరారురా! నీరాతబాగుంటే, స్వతంత్ర మొచ్చిన తర్వాత నువ్వు తప్పక మంత్రి వయితీరతావురా" అని

రామా: అవును. అంతటి అర్హతలు గాకపోలేదు.

పేర: అదృష్టరేఖ మనచేతిలోనుండి తొలగిపోయి యిలా ఏడుస్తున్నాను.

రామా: ఇప్పుడు మాత్రం తను కొచ్చిన లోటేమిటి లెండి.

పేర: సరే, అవన్నీ తరువాత మట్లాడుకొందాం (పొడుం పట్టుపీల్చి) ఇక అసలు విషయానికి వద్దాం. రామానుజయ్యగారూ! మన స్థిర చరాస్తుల భోగట్టా కొంచెం యిస్తారా?

రామా: తప్పకుండా నవరత్నఖచితమయిన సుక్షేత్రం పదవలకై ఎకరా లుందండి.

పేర: అయ్యా!

రామా: పోతే రెండెకరాలమామిడితోట, ఈ ఇల్లు..

పేర: ఊఁ సెలవివ్వండి (బుర్రాడిస్తాడు.)

రామా: ఏదో తను దయవల్ల కొద్దో గొప్పో నిలవ లోనే వున్నామనుకోండి.

పేర: సంతోషం.

రామా: క్రిందటి సంవత్సరం సరిగ్గా ఈరోజుల్లోనే మా ఇంటావిడ దేహం చాలించింది.

పేర: విచార కరమయిన విషయం

రామా: అందుచేత వాడికొక ఇంటివాడిని చేస్తే భారం తీరిపోతుంది. ఆ తర్వాత రామాకృష్ణ అనుకొంటూ పోయిగా ...

పేర: కాదుమరి!

రామా: చూడండి పేరయ్యగారూ!

పేర: చిన్నవాణ్ణి. తమ్ముడూ అని పిలిచినా యిబ్బంది లేదు.

రామా: ఏదో లోకాచారా న్ననుసరించే గాని, కట్నాలు కానుకలు విషయంలో నా కంతగా పట్టింపులేదు సుమండీ.

పేర: చిత్తం.

రామా: డబ్బు శాశ్వతమా చెప్పండి? గుణగణాలు, సాంప్రదాయాలు ముఖ్యం గాని.

పేర: ఎలాగయినా తెలిసినవారు.

రామా: ఈమధ్య మరీ వచ్చేపోయ్యే సంబంధాలకు తెంపులేకుండా వుంది సుమండీ! నలభై వేలిస్తామని, యాభై వేలిస్తామనీ డబ్బొస్తోంది గదా అని అడ్డమయినవాళ్ళతో చేయి కలుపుతామా!

పేర: భాధా! అందులోనూ తమరా?

రామా: మాధవయ్యగారి మంచి పెద్దలు విన్న తర్వాత నాకు, అసలు వేరే సంబంధం వెతుకు మనసు పోవటం లేదు.

పేర: చిత్తం.

రామా: చూడండి తమ్ముడుగారూ! మనలోమాట ..

పేర: నిరభ్యంతరంగా సెలవివ్వండి.

రామా: ఇలా అడుగుతున్నందుకు మరోవిధంగా అనుకోకు—

పేర: వ్యవహారం నిర్మొహమాటంగా వుండాలనే వాళ్ళ జాబితాలో నేను ప్రథముణ్ణి.

నారా (బయటనుండి వచ్చి) ఆఁ ఆఁ! అదేమిటి కాంతారమ్మొదినా; అలా దిగజారిపోతావేం వచ్చేం పోయిందావ్ ?

కాంతా ఇంకా నే బ్రతికేందుకు నారాయణయ్య బావా? నా అన్నకే నేను విషమయిపోయాన్న ను! (ఏడుస్తుంది)

నారా : ఏమిటీ విశేషం బావా ?

రామా : . (మాట్లాడడు. కుర్చీలో కూర్చుని చుట్ట ముట్టిస్తాడు).

నారా ఏం బావా మాట్లాడవు ?

రామా : ఏం మాట్లాడాలి ?

నారా మీ చెల్లెలి గొడవేమిటా అని ?

రామా : గొడవేముంది? నువ్వే చెప్పవోయ్ పెద్దమని షిని నా ఇంటికొచ్చిన పెద్దమనిషి. అవమానిం చటం సబబేనా ?

నారా ఎవర్ని ?

రామా ఆ పేరయ్యగారని, నాతో సంబంధం స్థిర పర్చుకొంటానని వొచ్చారని, ఆయన్ని నానా మాటలు అని, ఇంటినుండి వెళ్ళిపొమ్మంటుందా? ఇదేమయినా సబబేనా !

నారా అదేమిటి కాంతారమ్మొదినా! అంతకోపంవస్తే పనికే యెలా ?

కాంతా నువ్వూ అలాగే అంటావేం నారాయణయ్య బావా? మనిద్దరం అనుకొన్నదేగా ?

రామా ఏమిటే? ఇందులో నీ పాత్రకూడా వుందా నారాయణ మూర్తి! సరే! చూస్తాను మీ రంతా తన్నుకు చచ్చినా సరే; నా కొడుక్కి మాధవయ్యగారి సంబంధమే ఖాయం

నారా కాస్త ఆలోచించి మాట్లాడుబావా? అంతా నీ ఇష్టమే నేమిటి.

రామా కాక? మీ ఇద్దరిదా? నా కొడుకు పెళ్లి!

నారా అదే నీ కొడుకు ఒప్పుకోవద్దా అని.

రామా నా కొడుకు నా మాట కాదంటాడా ?

నారా సరే. అది చూస్తాను పద కాంతారమ్మొదినా.

కాంతా : ఎక్కడికి ?

నారా ఈయనతో మనకేమిటి? అసలువాడు వాడికే అడుగుదాం. సత్తిగాడిదగ్గరకే వెళదాం పద.

రామా : వెళ్లండి. ఎక్కడికయినా వెళ్లండి ఎవరెలా చచ్చినా సరే! నా కొడుక్కి మాధవయ్యగారి సంబంధమే ఖాయం.

నారా సరే నేనూ చూస్తాను. నువ్వెలా ఈ పెళ్ళి చేస్తావో? (లోని కెళతాడు పేరయ్య. ఏసు (కొంపెలు లోపలనుండి వస్తాడు.)

రామా ఇదుగో పేరయ్యగారూ!

పేర ఁబాబూ!

రామా : రాత్రి బండికి మాధవయ్య బావగారొస్తే సరే! లేకపోతే రేపుదయమే మనం తెనాలి వెళదాం.

పేర చిత్తం

రామా : అక్కడే వ్యవహారం పైసలు చేసుకొని, ముహూర్తం పెట్టిద్దాం. ఈ నెలలో పెళ్లి జరిగి తీరాలి

పేర అలాగే!

రామా : రామానుజయ్యనాయుడంటే అల్లాటప్పా అను కొంటున్నారు! నా కొడుకు పెళ్ళికి కూడా నా ఇష్టం కాదట! ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు నా నిక్కడే వుండాను బాబూ!

రామా : పోస్టాఫీసుకెళ్ళి, ఒక కవరుతీసుకురా. వెంటనే రమ్మని అబ్బాయికి వుత్తరం రాయాలి. ఇంద. (చిల్లరతీసి యిస్తాడు) (ఏసుకొండలు వెళ్ళబో తుంటాడు)

ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు అయ్యా!

రామా : వద్దులే రా. కవరయితే లేటవుతుంది. ఏకంగా వైరిద్దాం

ఏసు : చిత్తం

నారా (లోపల నుండి సంచీతో వచ్చి) వెళదామా కాంతారమ్మొదినా.

కాంతా : నేను మాత్రమిక్కడెందుకు? నేనూ వస్తాను. వుండు కలిసి వెళదాం. (లోనికెళ్ళుతుంది)

రామా : వెళ్ళండి నిక్షేపంగా వెళ్ళండి. వచ్చేం చెడిరిస్తారా?

ఏసు . అదేంటిబాబూ! పెళ్లమ్మగోరు.....

రామా : ఏసుకొండలూ!

ఏడు: అయ్యా!

రామ: మళ్ళీ కోయమాకురో కొన్నాళ్ళు.

ఏడు: నిత్తం.

పేర: కాని మూగాడు అన్నయ్యగారూ!

రామ: ఏమిటది?

పేర: తొందరపడి అయిన వాళ్ళను

రామ: మీకు తెలియదూరుకోండి పేరయ్యగారూ!

పేర: చిత్తం.

(శాంతారమ్మ ట్రంకుతో తిరిగి వస్తుంది)

శాంతా: పద నారాయణయ్య బావా తోడబుట్టిన దాన్ని తిరస్కరించి ఏం బావుకుంటాడో చూస్తాను.

ఏడు: భోజనం సెయ్యండి అప్పమ్మగారూ!

శాంతా: ఇంకా ఈ కొంపలో గంగ ముడతానట్రా!

రామ: మంచిది (నారాయణయ్య, శాంతారమ్మ వెళ్ళిపోతుంటారు. బయటనుంచి పోస్టుమేన్ కేక వినిపిస్తుంది) నారాయణయ్య, శాంతారమ్మను ఆగమని సైగ చేస్తాడు.

రామ: ఉత్తరమేదో వచ్చింది లాగుంది చూడరా

ఏడు: (బయటకెళ్ళి కవరుతో తిరిగొస్తాడు) ఇదుగోండి.

రామ: (అందుకొని, పరిశీలించి) అబ్బాయే రాశాడు!

ఏడు: ఏం రాశారు బాబూ?

రామ: ఉండరా చదవండే!

(చింపి చూస్తాడు ఒక ఉత్తరం, ఫోటో వుంటాయి. ఆదుర్దాగా ఉత్తరం చదివి) కొంప మునిగిందిరా ఏడుకొండలూ!

(బిగ్గరగా అరచి కూలబడతాడు.)

ఏడు: ఏంది బాబూ!

శాంతా: ఏమిట్రా అన్నయ్యా?

నారా: ఏం జరిగింది బావా?

పేర: ఏమిటండీ విశేషం? (అంతా ఆదుర్దాగా దగ్గర కొస్తారు)

రామ: ఏం చెప్పను నారాయణయ్యా! నీ అల్లుడు నా కొంప నిలువునా ముంచాడు.

నారా: ఏం జరిగింది బావా?

రామ: ఏం జరగకూడదో, అదే జరిగింది. యిటు చూడు. (లెటరందిస్తాడు.)

నారా: (అందుకొని లోలోపలే గబగబా చదివి) ఆరి పిడుగా! ఎంతపని చేశావురా!

శాంతా: ఏమిటి నారాయణయ్య బావా?

ఏడు: పైకి సదవండి బాబూ

నారా: ఇంకా చదివేదేముందిరా ఏడుకొండలూ! మీ సత్యంబాబు ఒక కాలేజీ పిల్లని ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడట! ముందుగా తెలిసే వాళ్ళ నాన్న ఒప్పుకోడని పెళ్ళయింతర్వాత ఉత్తరం రాశాడు

ఏడు: ఆఁ!

శాంతా: నిజంగానా నారాయణయ్య బావా?

నారా: నీమీద ఒట్టు. శాంతారమ్మొదినా ఇదుగో ఫోటో కూడా పంపాడు

శాంతా: కొంప ముంచావు కదరా సత్తిగా! (భోరు మంటుంది)

పేర: కాలమే మారిందిలెండి, ఈ కాలంలో ఇలాంటివి సహజంగా జరిగిపోతూ వున్నాయి

ఏడు: మొత్తానికి పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చింది లెండి బాబూ! [తెర]

# ఉపగూహనము

శ్రీ శివశంకరశాస్త్రి

## పూర్వార్థము

౧

ఎవరో యొక చాటుకాడు
ఇటీవలను జెప్పినట్టి
గాథ ననుసరించి యల్లు
కథన కావ్య మీ రచనము.

సత్యమైన, కాకున్నను
సంఘటనలు విన్నవారి
పెదవులపై దరహాసం
బుదయించుటయే తథ్యము.

సంఘటనం బాదియందు
సరసముగా సాగె, కాని
మధ్యమార్గమందు మిగుల
మందముగా నడచుచుండె.

వివిధగతుల రాగగాథ
విచిత్రముగ నొక్కనాడు
పరిణయోత్సవమ్ములోన
పరిసమాప్తి నొందెనంట!

౨

మంథనాగ్రహారమందు
మహీసురుల వంశమందు
పుట్టినాడు యోగ్యుడైన
పురుషోత్తమశర్మాఖ్యుడు

ఆంగ్లవిద్యతో పాటుగ
అధ్యయనము చేసినాడు
తండ్రికడన కొంత కొంత
తైత్తిరీయసంహితలో.

వేదములో వర్ణితమౌ
వివిధదేవతాకృతులను
చిన్ననాటనుండి యతడు
చేయుచుండు మృత్తుతోడ.

పాఠశాలలోని విద్య
పరిసమాప్తి నొందె నంత
అవల నేమి చేయవలయు
నన్న చర్చ సాగబొచ్చె.

అంతలోన తండ్రి పోయె
అమ్మ చిన్ననాడె చనియె.
మిగిలె బంధువర్గమందు
మేనమామ యొక డతనికి.

మంథనలో పెంకుటిల్లు
మంచి పంటభూమియు గల
వతనికి, లేదేమాత్ర
మ్మార్థికమ్ముగా లోపము

అగ్రహారమందు కలరు
అయిదునూర్ల పట్టభద్రు
లందుచేత మేనమామ
ఆ చదువే చదువు మనియె.

అతడు పట్టభద్రుడైన
ఆత్మజాత నిచ్చి పెండ్లి
వైభవమ్ముతోడ జేయ
వచ్చు ననుచు మామ కోర్కె.

3

మేనమామ కూతురైన
మీనాక్షీదేవి కూడ

# ఉపగూహనము

శర్మ శిశుదశలోన చెప్ప
శక్యముకానట్టి ప్రీతి.

అనుదినమ్ము వృద్ధించెడి
యభ్యాసమువలన ప్రీతి
కలిసిపోయె మానసములు
క్రమముగా నుభయులకును.

చనవువలన నడుమనడుమ
చమత్కారవాక్కు లాడి
గూఢముగా ముద్దులాడు
కుమారి చెక్కిళ్ళ నతడు.

ఎదురుగా నరుగుదెంచు
నేని మేనమామకూతు
రుల్లాసముతో నలతిగ
నుపగూహన మాచరించు.

పిన్నవారి రాగసరణి
పెద్దల కభిమతము కాన
పరిణయమ్ము నిశ్చయ మని
భావించిరి బంధుజనులు.

ఆమె జనని వాంఛితంబు
ఆయేడే పెండ్లి చేయ
మేనల్లుని చదువు ముగియు
మీద చేయ తండ్రి తలపు

౪

పంపినాడు మేనమామ
భాగ్యనగర కలాశాల
లోన జేరి చదువు మనుచు
మేనల్లుని మంచినాడు.

అచటి కలాశాలలందు
అలభ్యమైపోయె తావు
చిత్రకళాశాలలోన
చేరినాడు తుదకు శర్మ

శక్తికొంత, ప్రీతికొంత
స్వతస్సిద్ధముగనె యుండు
కారణమున శిల్పకళను
కడువడిగా నేర్వ కలిగె.

అచటి యొజ్జలెల్ల సిద్ధ
హస్తులైనవార లగుటజేసి
సహాధ్యాయులైనవారు
శ్రద్ధధాను లగుటవలన—

చిత్రకళాశాలలోని
జీవిత మాతనికి మిగుల
ఉద్బోధక ముత్తేజక
ముల్లాస ప్రదము నయ్యె

చలికాలపు సెలవులలో
స్వగ్రామము చేరువరకు
ఈ విద్యాభ్యాసచరిత
మెవ్వరికిని తెలుప డతడు

నిజము తెలిసి మేనమామ
నివ్వెరపా టొంది యపుడు
కొంతవడికి తెప్పరిల్లి
కోపముతో ననియె నిట్లు

"కులీనోర్వి సురుడ నీవు
కులాలుండ వయినావా!
భావికాలమందు రాతి
పనివాడవు కానుంటివి!

ఉన్నయెడల నీ తండ్రియె
ఒప్పునొకో దీనికి? నీ
విద్యావిషయములో నిక
విడిచినాను నా బాధ్యత!"

విరసవాక్యములకు శర్మ
విమనస్కుం డగుచు పోయి

గోదావరీతీరంబున
కొంతతడవు విశ్రమించె—

కాంచి శిథిల విగ్రహములు
గౌతమేశ్వరాలయమున
స్వామి దర్శనమ్ము చేసి
సదనమునకు జేరినాడు.

"ఇంత ప్రొద్దుపోవు వరకు
ఎచట తిరిగినావు బావ?
అటులున్నా వెందుల?" కని
ఆదరముగ నడిగె కన్న.

"మీ నాయన యే మనెనో
మీనా, విన్నావు కదా
చెప్పుము నీవైన నిజము,
శిల్పవిద్య దూష్యంబా?"—

ఆ మాటల కర్థోక్తిన
అనునయసుస్వరముతోడ
"తనకు నచ్చు కార్యము నే
తత్పరతం జేయదగును.

"నన్నమాట కేమి కాని
నా ప్రతిమను చేయుదువా?
మిగుల ప్రీతి శిల్ప" మనుచు
మీనాక్షీదేవి పలికె.

బాలపలుకు నమాయికపు
భాషణముల తెప్పరిల్లి
చిరునగవున శర్మ యామె
చెక్కిళులను ముద్దాడెను.

౫

మేనమామ, మేనత్తయు
మీనాక్షీదేవి కూడ
వారించుచు నున్న వినక
స్వగ్రామము విడిచె నతడు.

నిజకళ పురుషోత్తముండు
నిష్ఠతోడ నభ్యాసము
చేయుచు నక్రమముగాను
సిద్ధహస్తు డగుచుండెను.

భారతీయ శిల్ప చరిత
పౌరాణికగాథావళి
పాశ్చాత్యకలాచరిత్ర
పఠియించుచునుండె నతడు.

చేతినిండ ధన ముండుట
చేత ప్రసిద్ధాలయములు
కళాక్షేత్ర దర్శనమ్ము
కావించును సెలవులలో

చిత్రలోకవిహారణంబు
చేయు నతని కప్పుడపుడు
మీనాక్షీదేవి రూపు
మెలగుచుండు స్మృతిపథమున.

౬

అచట మంథెనాగ్రహార
మందు తల్లి తమ తనూజ
పరిణయోత్సవమ్ముగూర్చి
భర్తను త్వరపెట్టుచుండె.

"అన్వేషణ చేయుచున్న
ననుగుబిడ్డ పెండ్లికొరకు
యోగ్యుడైన వరుం డిచట
ఒకడు కూడ కానరాడు."

"మేనల్లుడు చెంతనుండ
మీనాక్షికి వేరే వరు
డెందులకో? మీ వాక్కులు
ఎప్పుడు చిత్రముగ నుండు!"

అనెడి భార్యభాషణముల
కడ్డు వచ్చి భర్త యనియె :

"బొమ్మలు చేసెడివానికి
పుత్రిక నెట్లీయగలను!"

"ఇదియా మీ సందేహం,
ఇంకేమో యనుకొంటిని.
పురుషోత్తమశర్మ కేమి
భూలోపము, ధనలోపము?

చేయువచ్చు సంపాదన
శిల్పకలామూలమ్మున
మంచిపేరు వచ్చు ననుచు
మన మీనాక్షమ్మ మతము."

ఇట్లు భార్య ప్రతివచనం
బిచ్చినంత, యజమానుడు
ఏమి యనక శిరసు మాత్ర
మిట్టటు కదలించినాడు.

౪

పెట్టెలతో బుట్టలతో
పెద్దపెద్ద యట్టలతో
స్వగ్రామమునందు దిగుచు
స్వగృహమ్ము చేరె శర్మ.

పరిసమాప్తి చేసి విద్య
భాగ్యనగర కలాశాల
విడిచి వచ్చి మంథెనలో
విశ్రమింప దలచినాడు.

ఎనిమిదేండ్ల నారాయణ
ఎగురుచు నుల్లాసమునను
అమ్మ, బావ వచ్చినాడె
అనుచు తల్లితోడ జెప్పె.

"నాకు చేయితీర లేదు—
నారాయణ, మీనాక్షీ,
బావను పిలుచుకు రండని
పంపె జనని ప్రీతితోడ.

తెచ్చుకొన్న వస్తుచయము
దీర్చిదిద్ది, వారి వెంట
ప్రక్క వీథిలోని మామ
భవంతికిం జేరె శర్మ.

మేనత్తకు పట్టుచీర
మీనాక్షికి నారాయణ
కెన్నెన్నో వస్తువులను
ఏర్పరించి యిచ్చినాడు.

కుశలాదిక మడుగు వెనుక,
గోదావరి కేగి వత్తు
అట్టె ప్రొద్దుపోవకుండ
నని పురుషోత్తము డరిగెను.

భోజనార్థ మతని బిలువ
బోయినపుడు రాత్రి కన్య,
"ఉండుండుము మీనాక్షీ,
ఒక్కదాని మరిచినాను"—

అని యతండు పేటి తెరచి
అందలి ముత్తెముల దండ
దీసి యామె కంఠంబున
వేసి యప్రయత్నముగా—

వెనుకకు రెండడుగు లేసి
వీక్షించుచు నామె మోము
చిరునగవున ముందు కరిగి
చెక్కిలి ముద్దాడినాడు.

"పెద్దదాన నయినా" నని
పిల్ల పలుక లజ్జతోడ,
ఉల్లాసముతో నతండు
ఉపగూహన మొనరించెను.

౫

అత్త భాగ్యనగరవార్త
లడిగి, పెరుగు వేయువేళ

ద్రోయమని మార్క్సు తన జీవితంలో ఎన్నడూ ఉపదేశించలేదు. ఐతే ఆ పరిపక్వస్థితి వచ్చినతరువాత అహింసాయుతంగా పెట్టుబడిదారీ విధానాన్ని తొలగిద్దామంటే సాధ్యమయే విషయం కాదని ఆయనఊహ. ఆ పరిస్థితులలో తరతరాలుగా దుర్దశలో ఉన్న కార్మిక వర్గమంతా తిరుగుబాటుచేసి విప్లవంలో విజయాన్ని సాధిస్తుంది. పెట్టుబడిదారీ విధానానికి ప్రారంభంలోనే పతనం ఎన్నటికీ సంభవించదు దాని ఉచ్ఛస్థితి వచ్చిన తరువాత దానివలన అన్నీ కష్టనష్టాలే కాని ఏమీ ఉపకారం లేదని ప్రజలు తెలిసికొన్న తరువాతనే దానికి పతనం సంభవిస్తుంది ఈవిధంగా పెట్టుబడిదారీ విధానపు పతనము, కార్మిక రాజ్యాంగవ్యవస్థ నిర్మాణము చాలసహజంగా, పరిణామాత్మకంగా జరుగుతాయి

ఈ పరిస్థితులలో సామ్యవాద నాయకుల కర్తవ్యం ఏమిటోకూడా మార్క్సు ఉపదేశించాడు పీడిత కార్మికవర్గానికి వారిబాధలకు హేతువేదో తెలిపి వారి తిరుగుబాటుకు సర్వవిధాల చేయూతనొసగి వారికి తన సలహాలనివ్వడమే నాయకుల కర్తవ్యం

తన సిద్ధాంతాల శాస్త్రీయతను నిరూపించుకొనడానికి అవి ఆచరించబడితే ఏమిజరుగుతుందో ముందుగానే సూచించాడు కార్ల్ మార్క్సు కార్మికులసంఖ్య క్రమముగా పెరిగిపోవడం, పెట్టుబడియావత్తూ కొందరు వ్యక్తులహస్తాలలో కేంద్రీకృతం కావడం ప్రథమంగా జరుగుతుంది. కార్మిక వర్గానికీ ("Proletariat") పెట్టుబడిదారులకు నడుమ సంఘర్షణవృద్ధి అవుతుంది ఈ సంఘర్షణలో కార్మికవర్గం రెండువిధాలుగా విజయాన్ని సాధింపవచ్చును ఒకటి ప్రజాస్వామ్య పద్ధతులద్వారా ఎన్నికలలో గెలిచి అధికారాన్ని హస్తగతం చేసికోవడం, రెండవది విప్లవాన్వితంగా పెట్టుబడిదారులను సంహరించడం ప్రశాంతమార్గంద్వారా విజయం ప్రజాస్వామ్య దేశాలలో జరగడానికి కొద్దిగా అవకాశం ఉందని మార్క్సు సూచించినప్పటికీ, ఆ విధానంపైన ఆయనకు నమ్మకం లేదు

పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వమునందినకొలదీ కార్మికవర్గమునకు కష్టనష్టాలు ఎక్కువౌతాయని మార్క్సు తెలియజేశాడు క్రమంగా పెట్టుబడిదారులు అధికలాభాలనాశించి శ్రామికుల వేతనాలను తగ్గించి, వారుచేయవలసిన పనిని కష్టతరం చేస్తారు. రానురాను ఉత్పత్తి పెరిగిపోవడం, గిరాకీ తగ్గిపోవడం సంభవిస్తుంది. తమవద్ద పెరిగిపోతూన్న పెట్టుబడిధనంతో లాభాలకోసం తహతహలాడే ధనికులు ఏమిచేయాలో తోచక ఈ విధానాన్ని అన్నిరంగాలకు వ్యాపింపచేస్తారు. వ్యవసాయంలోకూడా ఈవిధానం ప్రబలమౌతుంది భూమిఅంతా కొంతమంది పెట్టుబడిదారుల వశమై తదితరులంతా కేవలం కార్మికులౌతారు. ఈ రంగంలోకూడా పెట్టుబడి హెచ్చైన కొలదీ లాభాలు తగ్గిపోతాయి ఈవిధంగా ఒకవంక నిర్విరామంగా పెరుగుతూన్న పెట్టుబడి ధనం, తీవ్రంగా పడిపోతూన్న గిరాకీ —ఇవికాకతోడుగా ఆర్థికరంగంలో తీవ్రసంచలనం కలిగించే పాటుపోట్లు ఎక్కువై సంక్షోభాలకు దారి తీస్తాయి కార్మికవర్గం సహనం పూర్తిగా కోల్పోయి అఖండవిప్లవానికి ముందంజవేస్తుంది ఆ మహావిప్లవ సంగ్రామరంగంలో పెట్టుబడిదారులు సంపూర్ణంగా నాశనం చేయబడతారు అధికారం, ధనం, అన్నీ కార్మికుని వశమౌతాయి ఈ విధంగా, తనలో అంతరంగికమైన తీవ్రమైన దోషాలమూలంగానే పెట్టుబడిదారీ వ్యవస్థ దారుణాంతం పొందుతుంది అంతా సహజ చారిత్రక పరిణామం దీనినెవరూ ఆపలేరు ఇదే భవిష్యత్తునుగూర్చిన మార్క్సు ఊహాచిత్రం

పెట్టుబడిదారీ విధాన వినాశనం, కార్మికపక్ష విజయం సిద్ధించినతరువాత విశ్వశాంతి, మహాసౌఖ్యం—ఇంకా ఏవేవో వాటంతటవే కలుగుతాయి అని అనడమే కాని తత్సాధనకు ఏ నిర్దిష్టప్రణాళికను మార్క్సు సూచింపలేదు ఆ స్థితిలో రాజ్యాంగాన్నిగూర్చి, ప్రభుత్వాన్నిగూర్చి, ఆయన కొంతవరకే పేర్కొన్నాడు అప్పుడు కార్మికపక్ష కార్యనిర్వాహకవర్గమే ప్రభుత్వంగా వ్యవహరింపకలదట. విరోధిపక్షం సర్వనాశనమవడంవలన దీనికి సర్వనియంతృత్వాధికారాలు వస్తాయి. దీనినే మార్క్సు కార్మికపక్ష నియంతృత్వము ("Dictatorship of the proletariat) అని వ్యవహరించాడు కాని ఈ నియంతృత్వంకూడ అట్టేకాలం ఉండదు సంపూర్ణమైన సామ్యవాద స్థితి రాగానే ఈ రాజ్యాంగమంతా దానంతటదే సహజంగా అదృశ్యమౌతుంది. తిరిగి ప్రజలలో స్వేచ్ఛా సమానత్వాలు, పరస్పర సహకారం తలెత్తుతాయి వర్గవిభేదాలు, పరస్పర కలహాలులేని ఆ కార్మిక మహావ్యవస్థలో మానవుడు సర్వసుఖాలననుభవిస్తాడు ఈ విశదమైన ఊహాచిత్రమే కాని ఒక విశదమైన నిర్దిష్ట ప్రణాళికను మార్క్సు సూచింపలేదు సామ్యవాద వ్యవస్థలో ధరల నిర్ణయం ఏ విధంగా జరుగుతుంది? పెట్టుబడి ఏ రంగాలలో ఏ పద్ధతులలో ఉపయోగింపబడుతుంది? ద్రవ్యోల్బణాది దుష్ఫలితాలు ఏ విధంగా అదుపులో పెట్టబడతాయి? ద్రవ్యము, లాభములు ఏ పరిమాణాలలో పంపకం చేయబడతాయి? అనే ప్రశ్నలకు మార్క్సు సమాధానాలు సూచింపనైనా లేదు. అయితే ఆయన సిద్ధాంతాలవలన కార్మిక పక్షానికి ఒక గొప్ప ఆధారం లభించింది. ఏ విధంగా వ్యవసాయ దారులకు ఫ్రెంచి ఫిజియోక్రాట్ ఆర్థిక విజ్ఞా

ములకన్నిటికీ చేయూత నొసగిందో, ఏ విధంగా పెట్టుబడిదారులకు సాంప్రదాయిక ఆర్థిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలు ప్రోత్సాహాన్ని కలుగజేశాయో, అట్టి విధంగానే కార్మిక పక్షానికి మార్క్స్ రచనలు అధిక బలాన్ని చేకూర్చాయి.

ఈ విధంగా మార్క్స్ ఆర్థిక శాస్త్ర సిద్ధాంతాలను సింహావలోకనం చేసుకొన్న పిదప తత్ప్రయోగ సత్యాన్ని పరిశీలిద్దాం

ఏ ఆర్థిక సిద్ధాంతాలను అంశగా చేసికొని మార్క్స్ శిష్యులు సామ్యవాద తత్వాన్ని విప్లవాత్మకంగా ప్రపంచ విస్తృతం చేయాలని నడుము కట్టుకున్నారో, ఆ తత్వంలోనే అతి ప్రాథమికమైన దోషాలుండడం గమనార్హం.

మార్క్స్ సగర్వంగా నిర్ధారించి అతి శాస్త్రీయమని చాటిన చారిత్రక పరిణామ వాదము అసత్యమైంది. ఆయన ఊహించినట్లు, పెట్టుబడిదారీ విధానం ఎంతో పరిపక్వస్థితినందిన అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి దేశాలలో సహితం వ్యవసాయం పారిశ్రామికం చేయబడి కొద్దిమంది పెట్టుబడిదారుల హస్తాలలో భూమంతా కేంద్రీకరింపబడలేదు. పైగా, ఆయా దేశాలలో ప్రభుత్వాలు చేసిన భూసంస్కరణములవలన వ్యవసాయరంగంలో అనేక మార్పులు వచ్చాయి. భూమి కొలదిమంది పెట్టుబడిదారుల చేతులలో కేంద్రీకరింపబడటానికి మారుగా శాసనములవలన ఎంతగానో వికేంద్రీకరింపబడి చిన్న చిన్న రైతులకు ఆర్థికపటుత్వం కలిగించింది. ఈవిధంగా జరగగలదని మార్క్స్ మేధాశక్తి ఊహాతీతమైంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ పురోగమించినకొలదీ, కార్మికుల సంఖ్య అత్యంతాధికమై అన్ని వర్గాలను అధిగమిస్తుందని మార్క్స్ ఊహించాడు. కాని చరిత్ర గమనం దీనినికూడ అసత్యమునే నిరూపించింది. కాలక్రమాన వృత్తి నిపుణుల మూలంగాను, చిన్న చిన్న వర్తకములమూలంగాను, ఇతరమైన ఉపాధులమూలంగాను జీవనాన్ని సాగించేవారి సంఖ్య హెచ్చుతోంది కాని దేశమంతా కార్మికులతో నిండిపోవటం లేదు.

కార్ల్ మార్క్స్ ఊహాచిత్రణంలో అన్నిటికన్నా ముఖ్యమైన దోషము పెట్టుబడిదారీ వ్యవస్థ వృద్ధి చెందినకొద్దీ కార్మికుల కష్టాలు అధికమౌతాయని మార్క్స్ చేసిన వర్ణనమంతా అతిశయోక్తి! అని కొన్ని ఆధునిక పెట్టుబడిదారీదేశాలు నిరూపించాయి. బాగా వృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల్లో మార్క్స్ చెప్పినట్లు వేతనాలు తగ్గిపోయి, కార్మికులంతా కడగండ్లపాలు కాలేదు. వారి జీవనప్రమాణాలు రోజురోజుకీ పెరుగుతున్నాయి. అమెరికావంటి పరిపక్వస్థితి నందిన పెట్టుబడిదారీ విధానము గల దేశాలలో స్వంతకార్లలో సుఖంగా తిరిగే కార్మికులను చూస్తే మార్క్స్ ఊహాచిత్రం ఎంత వాస్తవికతా రహితమైనదో తెలుస్తుంది.

ఇక మార్క్స్ పరిణామ సిద్ధాంతంలో మరొక ఘోరమైన అసత్యాంశం ఒకటి ఉన్నది—కార్మిక విప్లవం, బాగా పరిపక్వత నందిన పెట్టుబడిదారీ దేశములందే సంభవిస్తుందని ఆయన ఊహ. ఇదికూడా సత్యదూరమని చరిత్ర నిరూపించింది. పందొమ్మిది వందల పదిహేడవ సంవత్సరం నాటికి రష్యాదేశంలో పెట్టుబడిదారీ విధానం అసలు ప్రారంభదశలో నయినా ఉండెనా అన్న విషయం సందేహాస్పదం. అల్లాగే విప్లవం నాటికి చైనాలో పారిశ్రామికాభివృద్ధి ఏమాత్రం లేదు. ఈ దేశాలలో విప్లవాలను రాజకీయ విప్లవాలంటే కొంత సబబుగా ఉంటుంది! ఇంక అటు వంక బాగా పరిపక్వ స్థితిలోనికి వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థలలో—ఉదాహరణకు అమెరికాలో అసలు సామ్యవాద మహావిప్లవ ప్రసక్తే లేదు!

ఈ దోషాల నటుంచి ఆర్థికశాస్త్ర విజ్ఞానిగా కారల్ మార్క్స్ స్థానం పరిశీలిద్దాం. కార్మికుల కష్టాలను చూచి అత్యాగ్రహంతో వ్రాసిన ఆయన విప్లవాత్మకమైన వ్యాసాలు, గ్రంథాలు, పటుతర రాజకీయ మహాప్రభంజనాలను పురికొల్పాయి. ఆయన సిద్ధాంతాల ఆధారంగా చేసికొని అనేక నూతన రాజకీయ పక్షాలు పైకివచ్చి చాలా అలజడి కలిగించాయి. అయితే ఈ విప్లవాలు ఆర్థికశాస్త్ర రంగంలో ఏమాత్రం నూతన వికాసాన్ని కలిగించలేకపోయాయని తెలుపవచ్చును. సాంఘిక పరిణామ విజ్ఞానానికి మార్క్స్ సిద్ధాంతం ఒక అమూల్యమైన చేర్పు. అయినప్పటికీ కేవలం ఆర్థికశాస్త్ర దృష్ట్యా దానికి అంత గొప్ప విలువ లేదు. మార్క్స్ ప్రతిపాదించిన మారకపు విలువల సిద్ధాంతం, వేతన సిద్ధాంతం—అన్నీ కూడా ప్రాచీన శాస్త్రజ్ఞులు చాలావరకు కూలంకషంగా చర్చించినవే కాని క్రొత్త వేమీ కావు.

ఈ విధంగా నిష్పాక్షిక మయిన ఆర్థికశాస్త్ర దృష్టితో చూస్తే కార్ల్ మార్క్స్—స్మిత్, రికార్డో, మార్షల్ మొదలైన ఆర్థిక శాస్త్రవేత్తల తరహాకు చెందినఆర్థిక శాస్త్రవేత్త కాదని చెప్పవచ్చును.

మినహాలో కొద్ది ఫలహారం మాత్రమే. మధ్య మధ్య ఏకాదశి ఉపవాసాలు, పూజలు యింటిదగ్గర భక్తులందరినీ పోగుచేసి భజనలు కూడా చేయించడం మొదలు పెట్టాను. కనిపించిన దేవుడి కల్లా నమస్కారం పెట్టాను కనిపించని గవుళ్లకి భక్తితో మొక్కడం ఆరంభించాను. ఆఖరికి ఆకేసులో నాయుడు గారికి జీవితాంతం ఖైదు వేయించేందుకుగాను ఆ భగవంతుడికి నా తలమీద వెంట్రుకలు, గడ్డము మొగుగట్టి మొక్కుకున్నాను

నాయుడుగారి కేసునుగురించి చాలా ఆత్రుతతో తెలుసుకుంటున్నాను ఈ మధ్య ఆయన కేసు గురించి వింటూంటే నాకు చాలా విచారం, కోపం, పొంగుకువచ్చాయి "ఇంత భక్తితో కొలుస్తున్నా, భగవంతుడికి దయలేదా!" అనుకున్నాను. దేవుడు నమ్మిన వాళ్ళను మోసం చెయ్యడుట ఏదో వేషం వేసుకునయినా సరే వచ్చి భక్తులని రక్షించి తీరతాడని శ్రుతిస్మృతులు ఘోషిస్తున్నాయి. అయినా నేడో రేపో తెలుస్తుంది దేవుడి సంగతి!" అనుకునే వాడిని

ఒక్కొక్కసారి నాయుడుగారి ప్లీడరుగారి సంగతి వింటూంటే, అసలు దేవుడనేవాడు ఉన్నాడా అనే సందేహానికి కూడా తావొచ్చింది నాయుడు గారి ప్లీడరు అఖండ ప్రతిభావంతుడట! చాలా గట్టివాడట ఎదుట వారిని తికమకపెడుతున్నాడుటంతే! అతడు అడ్డు ప్రశ్నలో అఖండుడుట. ప్రతికక్షులు ఆయన యిచ్చే ప్రశ్నలకి జవాబు లియలేక పరుగు లంకించుకున్నారట! యివీ వార్తలు!

దేవుడి మీద కోపం ముంచుకు వచ్చింది. "అయినా నేడో రేపో తెలుస్తుంది దేవుడి సంగతి అప్పుడు చెప్తాను ప్రపంచం అంతా చాటేస్తాను. తర్వాత చూసుకుంటా" ననుకునేవాడిని నేను అలాగే తేలింది దేవుడున్నాడా లేదా? అనే ప్రశ్నకు నిలువు జవాబు.

నాయుడుగారికి ఆరు నెలల కఠిన కారాగార వాసం విధించారు

"రక్షించావు దేవుడా!" అని వేయినమస్కారాలు చేశాను చేసిన పూజలు పెట్టిన నమస్కారాలు ఊరికే పోతాయా!

ఇంక దేవుడి మొక్కు మంచిది చూసి తీర్చాలి. వెంటనే బయలుదేరి వెళదామనుకున్నా కాని చాలా రాత్రి కావడంవల్ల మానేశాను మరునాడు దుదయాన్నే బయలుదేరి పురోహితుడి యింటికి వెళ్ళాను కొండంత అడవిలాంటి నా గడ్డాన్ని వదిలిపెట్టడానికి తయారవడం కష్టంగానే ఉంది.

అయినా యిది భగవంతుడితో వ్యవహారం ఆయన ముందా మనచాటులు విచారంతో గడ్డాన్ని, ప్రేమతో పిల్లదూలాలాంటి నా బుర్ర తడుముకున్నాను ఆ విచారంలో నా కళ్ళలోనుండి ఒకటి రెండు అశ్రుకణాలు దొర్లాయేమో నాకు తెలీకుండా ఇలా నాలో నేను బాధపడుతూంటే, శాస్త్రిగారు తన కార్యాన్ని మొదలుపెట్టారు.

"మాగారా" అన్నాడాయన నన్ను చూడగానే

"ఆ! ఏమిటే" అంటూ ఉలిక్కిపడి ముందు వెనకా చూశాను

"ఏమీ లేదులెండి" అన్నాడు తాపీగా ఆయన ధ్యానం చూచేసరికి నా కళ్ళు మండింది

"ఏమీ లేకపోతే ఏం చూడమన్నారయ్యా!" అన్నా విసుగ్గా

"అబ్బే! ఏమీ లేదు ఆ ముసలిముండావాడు చాలా మంచివాడు"

"ఆ ముండావాడికో కొత్త పెలిద్దరూ బాబూ"

"ఆ నాయుడుగారండీ! చాలా సత్పుగ్గడు తమకు యీ ఉద్యోగం ఆయనే వేయించారట గా! ధర్మాత్ముడు"

"అదే తమవంటి పెద్దలు చెప్పుకుంటున్నారీ ఊరిలో" అన్నా కోపం పట్టలేక.

"మంచివాడికే కష్టాలన్నీను" అని పెదవి విరిచి, బల్లి అరిచినట్టు దప్పుడు చేసి "ఇంకేమిటిలెండి లాభం! ఉద్యోగమూ పోతుంది. శిక్షను అనుభవించాలి" అన్నాడు తన సానుభూతి యిత్తూ మాటలద్వారానే గాకుండా ముఖంద్వారా కూడా ప్రకటిస్తూ

"అద్భుతంలే మరి!"

"అయినా పెద్ద కోర్టు కెళతాడుటలెండి."

"అయితే యింకా నాకేమవుతాడుట!" అన్నా నా అసూయ కప్పిపుచ్చడానికి ప్రయత్నం చేస్తూనే

"ఏమో మరి"

"పెద్దకోర్టుకెళ్ళడం అనవసరం. ఏదో ఓ చిల్లిగవ్వ యింట మిగిలితే అది ఖర్చు చేసుకోవడం ఒక్కటే జరుగుతుంది"

"నేనూ అదే చెప్పానండి నా సంగతి కానివ్వు శాస్త్రి"

"చాలాసేపయింది బిళ్ళకత్తి" అంటూ ఓ నమస్కారం ఆయన మొహాన్ని కొట్టేసి బయలుదేరాను యింటివైపు.

పాపం శేషంగారు వచ్చాక ఎంచేత వెళ్ళిపోతున్నారో అర్థం అవక గాభరాలో శాస్త్రులుగారు అలాగే నిలబడిపోయారు నిశ్చేష్టంగా "ఇదే దేవుడి పరీక్ష" అనుకుంటూ యిల్లు చేరాను, మిగిలిన ఆఫీసు పని ముగించడానికి.

## 3

నాయుడుగారి సంగతేమీ తెలిసింతేకు అప్పుడు ఆయన కుటుంబం గూడా మావూరు వదిలి ఆయన భార్యతరిఫి గారింటికి పోయిందట. ఆయనను గూర్చి నేను చాలా వాకబు చేశాను కనిపించిన ప్రతివ్యక్తిని ప్రశ్నించాను ఒక్క సెలవు తీసుకుని స్వయంగా వెళ్ళడం తప్పించి మిగతా పని అంతా చేశాను. తెలిసి యేడిస్తేగా నిసుగత్తి పోతేపోనీ అని ఊరుకున్నాను. ఆఖరికి పోస్టలు శాఖవారికీగూడా ఆయన చిరునామా తెలీదట! జైలుకుపోయి ఉంటాడనుకున్నాను

ఈ మధ్య నాకు యీ ఉద్యోగం ఖాయంచేసి వల్ల అర్థిస్తేకూడా ఇచ్చేరాగా నా అదృష్టానికి ఎంతో సంతోషించాను ఆఖరికి సత్యనారాయణ వ్రతం కూడా చేయించాను ఇక కొత్త గుంచి ముహూర్తం చూసి యీ పాత మొక్కుబడికూడా తీర్చేస్తే బాగుండునుకున్నా మనం అనుకున్నంతా జరిగింది

ఆ నాయుడు వర్తాలేదు. పాపం జైలుకుపోయి ఉంటాడు!

కొత్త వేగంగా యీ వైభవంకూడా తీర్చేస్తే యిక ముప్పంపదని, ఆ శాస్త్రులగారిచే తిరుపతిలో మొక్కుబడి తీర్చోడానికి ముహూర్తం ఏర్పాటు చేయించాను ఏదో వేగంగా అవుతుందని నేను ఆలోచిస్తుంటే వాడి సౌమ్యపోయినట్లు శాస్త్రి వాలు గోజాలాలస్యంగా యేంచాడా సందిగ్ధా కొందరు చుటాలనీ, పక్కాలనీ పిల్చేశాను సంతోషంకొద్దీ. పోనీ దేవుణ్ణిమానీ పోతాంని!

మా బావగారినిమాచి చాలా కాలం అయింది. పెనక ఉద్యోగాలు! ఎంతెంతదూరాలు పోతున్నా గ ప్రజలు అంగదూరం అయినా ఆయన రోలాగయినా కనపడితచ్చి నా మొక్కుబడి మహోత్సవం చూసి పోతాడని ఉత్తింముక్క రాలేదు. ఆయన్ని చూసి కూడా చాలా కాలం అయింది ఆయన రూపురేఖలే మరచిపోయాను పూర్తిగా

ఈ శుభవార్త చెప్పడానికి నా భార్యని పిలిచాను. అదిసి సంపదానంతో వచ్చిరాడంతోటే యీ వార్త చెప్పాను. ఎంతో ఆప్యాయంగా "మా అన్నను చాలాచాలా చూడాలనిఉంది." అన్నాను.

"బాగానే ఉంది మీరు చూడలేదాయేమిటి నా పెళ్ళికి?" అంది కొత్త సిగ్గు అభినయిస్తూ

"ఎంతకాలమయిందో ఆయన్ని చూసి! పని తొందరల్లో వస్తాడో రాడో!"

"మొన్న మా పుట్టింటికి వెళ్ళినప్పుడు చూశాను నేను. వాడూ మీలాగే ఏదో మొక్కుకుని గడ్డం పెంచి ఆనవాలు పట్టడానికికూడా వీల్లేకుండా మారిపోయాడు ఎంతపని తొందరలో ఉన్నా అన్నయినా చూడడానికి రాకపోతాడా?"

"అయితే ఆయనకుకూడా ఏదో మొక్కుబడి ఉన్నదన్నమాట మనలాగే! ఎందుకో ఆ మొక్కుబడి?"

"ఏమో ఎవరికి తెలుసు మీ మొక్కుబడులు మీరూను!"

"వెళ్ళి నీపని నువ్వు చూసుకో" అన్నాను ఆమె విసిరిన మాటలకు కొత్త కోపం తెచ్చుకుని ఆమె విసురుగా లోపలకు వెళ్ళిపోయింది

మరునాడు నయం ముహూర్తం దగ్గరకొస్తున్నా మా బావగారు రావడం కనపడింతేకు నాకొయన మొక్కుబడి ఎందుకో తెలుసుకోవాలని తహతహ! ఆ గడ్డం కోసం నా గడ్డం ఇంతగా ఓపికపట్టడం నాకే ఆశ్చర్యం వేసింది గడ్డానికి గడ్డానికున్న ఎంత సామరస్యం వుంది! రోడ్డు పై పుక న్ను మూయకుండా చూస్తున్నాను ఆ గడ్డంకోసం చాలా దూరం పెనుకొంది మనక్ను ముహూర్తం ఘడియలు సమీపిస్తున్నాయి అయినా బావ లేరు "ఇంక లేవండిబాబూ!" అంటూ అరిచాడు పురోహితుడు ఏదో మునిగిపోయినట్లు గడ్డం కోసం ఎదురుచూస్తున్నా ఘటం లేవక తప్పింది కాదు.

ఇలా లేచానో లేదో, దూరంలో గుఱ్ఱంబండి చప్పుడయింది తొంగిచూస్తునగదా బండిలోంచి కూడా ఒక గడ్డం నావైపే తొంగిచూస్తోంది సరిగా గుమ్మంముందు ఆగింది నా గడ్డం ఆనందంతో ఊగిపోయింది, ఆయన బండి దిగీదిగడంతోటే "వచ్చారా" అంటూ ఆనందాతిరేకంతో ఆలింగనం చేసుకున్నాను.

ఆప్యాయంగా గడ్డాంగూడా కలిసిమెలిసి కొంచెం చిక్కుపడి చాపలా అల్లుకున్నాయి ఒకదానితో ఒకటి!

మావాళ్ళంతా ఆశ్చర్యంతో చూస్తున్నారు

మా ఆవిడ కూడా గబగబా వచ్చి ప్రక్కన నిలబడింది

మళ్ళీ "క్షేమంగా వచ్చారా!" అన్నా హర్ష పులకిత గాత్రుడనై

"ఆఁ వచ్చానండీ" అన్నాడాయన నవ్వుచిలికినట్లు

"అయితే బావగారూ!" అన్నాను ఆయన మొక్కుబడిసంగతి అనుకుందామని

"ఇంకా నన్ను గుర్తుపట్టలేదుటండీ" అనిఆయన—

"ఆయన మీ బావగారు కాదండీ" అని నా చెవిలో మా ఆవిడ, అవడం ఒకేసారిగా జరిగాయి

ఆశ్చర్యంతో ఎగిరిచిమ్మాడ్తున యింకెవరు? మా గురువుగారు! నాయుడుగారు!

"మీరా!" అన్నాను దిగ్భ్రమచెంది

"మీ కేసోయ్ కేసు గెల్చాను బచ్చిబడి" అన్నారాయన ఆనందబాష్పాలు రాలుస్తూ

నా ప్రాణంమాత్రం అలా మిగిలించే యెగిరి పోయింది!

"నాపోషింగద్దకూడా ఇచ్చేశారు!" అన్నారాయన సంతోషంగా

నాపరిస్థితి జ్ఞాపకంవచ్చి అతన్ని పీక పిసికేద్దామా అన్నంతకోపము, అవమానము పొంగుకొచ్చాయి అత్యుద్రేకంలో యేమీ మాట్లాడలేకపోయాను

"ఇంత క్రొత్తవాడవుగదా! నీ కెలా యిచ్చారోయి నాఖాళీ ఉద్యోగం?"

"మీరు చలవవల్లనే నేను మీ అడుగుజాడల్లో నడిచాను. అంతే!"

ఆయన కూడా లేత నవ్వులు పెదవుల్లోంచి వదులుతూ ఓ కాయితం ఇచ్చారు, నన్ను చూడమంటూ. అదునకు అధికారపువారి యిచ్చారు అన్న మాత్రం ఆ పెద్దమనిషి పదవిలోంచి తీసెయ్యలేదు అదే పదివేలనుకున్నాను

"ఈ గడం, యిదంతా యేమిటి?" అన్నాడాయన

"మిమ్మల్ని యీ చిక్కునుండి తప్పించేందుకు గాను గవుడికి మొక్కుబడి" అన్నాను

"సెబాష్ ఇదంతా గవుడిదయే సందేహమేమిటి? నేను యీ కేసునుండి బయటపడెయ్యమని ఆ గవుడికి మొక్కుకున్నాను"

"అయితే యీ గవుడమహారాజుకే గనక యిద్దరం యీ మొక్కుబడులు తీర్చుకుందాం రండి" అన్నాను నవ్వుతూ

"అలాగే పదవోయ్" అన్నాడాయన

"అయితే గురువుగారూ! కొంపతీసి మిమ్మల్ని మళ్ళీకోర్టుకు లాక్కెళ్ళి మళ్ళీ మరోలా తీర్పు చెప్తారేమో!" అన్నా సందేహంతో

"అదంతా పిచ్చి! తెలుసుకోవోయ్ మన తీర్పుకి తిరుగులేదు తెలుసునా! యిదే సివిల్ ఉన్నత న్యాయస్థానం!" అన్నాడాయన ధీమాగా

# కుండలినీశక్తి: కొన్ని అనుభూతులు

శ్రీ వాసిరెడ్డి పార్థసారధి

వర్షములు వెనుకపట్టి, శరదృతువు ప్రవేశించినది ప్రొద్దు కూకింది రేడియోవారి వార్తలు చెప్పటం పూర్తయింది మా యింటి ప్రక్కనే రామాలయంలో ధ్యానం చేసుకుంటున్నాను అంతా నిశ్శబ్దంగా ఉన్నది. హఠాత్తుగ, ఆకాశం వైపున ఫెళ్ళున మెరిసింది! పెద్దగా ఉరిమి, పిడుగు పడబోతున్నట్టు మేఘములలో మెరిసినట్టుగా తీగమెరుపు మెరిసింది! అది కళ్ళుమూసుకొని ఉన్నా తీవ్రంగావుంది! మెరుపు వెంట పిడుగుపడుతుందని భయంకలిగి, ఆ అపాయంనుండి పారిపోదామని లేచి నిలుచున్నాను నిలుచోవడంతో నే స్పృహ వచ్చింది. నేను ఉన్నది దేవాలయంలో పైన కప్పు ఉన్నది, అక్కడ ఆకాశమూ లేదు మేఘములూ లేవు మెరుపులూ లేవు! బైటకూడా ఆకాశం నిర్మలంగా ఉన్నది. నాకు కనుపించినది, అద్భుతంగా మేఘములలో మెరియు మెరుపే ఇదేమిటా అని భ్రమించుకున్నాను. దీనిని గురించి పెద్దలను అడిగి తెలుసుకున్నాను అనుభవజ్ఞులు వ్రాసిన గ్రంథములను పరిశోధించాను. ఇందువల్ల కొన్ని అనుభవములు కలిగినా, కొన్ని శాస్త్ర పరిశ్రములు సేకరించకలిగాను జస్టిస్ వుడ్ రఫ్ కుండలినీయోగము, ఉపనిషత్తులు, తంత్రశాస్త్రములు పురాణములు, శాస్త్రీయదృష్టితో పరిశీలించి గొప్పగ్రంథములు వ్రాశారు జ్ఞానదేవులు, రామకృష్ణపరమహంస, వివేకానందస్వామి, లెడ్ బీటరు, అనిబిసెంటు, అరవిందులు కుండలినీ శక్తిని ప్రత్యక్షంగా దర్శించి, వారి అనుభవాలు ప్రకటించారు ఇంకా అనేక భారతీయులు, పాశ్చాత్యులు కూడా ఇట్టి దర్శనములను పొంది, వాటిని ప్రపంచమునకు చెప్పారు ఇవి నేటి సత్యశోధకులైన శాస్త్రజ్ఞులకు పాఠకులకు ఉపయోగపడునని ఉద్దేశ్యంతో క్లుప్తంగా మనవి చేస్తాను.

వెన్నెముకను, యోగశాస్త్రంలో బ్రహ్మదండమని, మేరుదండమని, వీణాదండమని పిలుస్తారు వెన్నెముకలో, కొమరకొడలో ఉన్నవి కాలువగా ఉన్నట్లు, వెంట్రుకవాసి సన్నని కాలువ ఉన్నది. వుడ్ రఫ్ అది వాకీలుదారంవలె ఉన్నదని వ్రాశారు. దీనిని సుషుమ్నానాడి అని అంటారు. వెన్నెముకను ఆధారం చేసుకుని కొన్ని చక్రము లున్నవి. ఎలక్ట్రిసిటీ తీగమీదుండు, దీపపు బల్బు లున్నట్లు కొమ్మమీదుండు పువ్వులు ఉన్నట్లు ఉన్నవి ఈ చక్రములను పద్మములని కూడా పిలుస్తారు నాడులు, చక్రములు చాలా సూక్ష్మమైనవి సూక్ష్మలోకములనుండి, శక్తులను గ్రహించి, ఇవి శరీరమునకు అందచేయు చుండును ప్రతిచక్రమునకు కొన్ని రేకులు, రంగులు బీజాక్షరములు శక్తులు, దేవతలు అక్షరములు, వాహనములు, ఆకారములు, తత్త్వములు వేరువేరుగా ఉన్నవి. వెన్నెముక మూలములలో, మలమూత్ర స్థానములమధ్య మూలాధారమనే చక్రమున్నది ఇది 4 రేకులు, పృథివీ తత్త్వము, గణేశదేవత, లంబీజము ఢాకినీశక్తి, పసుపువర్ణము కలిగి ఉన్నది

జననేంద్రియంవద్ద స్వాధిష్ఠానమనే చక్రం ఉన్నది ఇది 6 దళములు, జలతత్త్వం బ్రహ్మదేవత, వంబీజం, రాకిణీశక్తి, తెలుపువర్ణము కలిగి ఉన్నది

నాభివద్ద మణిపురమనే చక్రమున్నది ఇది 10 రేకులు, అగ్నితత్త్వం, రంబీజం, లాకినీశక్తి, విష్ణుదేవత, నిప్పురంగు కలిగివున్నది హృదయంవద్ద అనాహతచక్రం వున్నది ఇది 12 దళములు, వాయుతత్త్వం, ధూమ్రవర్ణం, యంబీజం, కాకినీశక్తి, శివుడు దేవతగా కలిగివున్నది

కంఠంవద్ద విశుద్ధచక్రం ఉన్నది ఇది 16 రేకులు, ఆకాశతత్త్వం, తెల్లవర్ణం, హంబీజం, శాకినీశక్తి, దుర్గాదేవత కలిగి ఉన్నది

భ్రూమధ్య ఆజ్ఞాచక్రమున్నది ఇది 2 దళములు, మనోతత్త్వం, ఓంబీజం, హాకినీశక్తి, ఆత్మదేవత కలిగి వున్నది శిరస్సుపైన, శిఖ (పిడికట్టిన జుట్టుముడి) క్రింద సహస్రార పద్మం వున్నది ఇది వెయ్యి దళములు, అతీతతత్త్వము అవ్యక్త ప్రణవబీజం, కామేశ్వరీ కామనాథులు దేవతలుగా కలిగి వున్నది

చక్రములలో దళములు చెప్పినవాటిలో కొన్ని అభిప్రాయభేదము లున్నవి యోగకుండలినీ ఉపనిషత్తులో అనాహత చక్రమునకు 16 దళములని, ధ్యానబిందూపనిషత్తు శాండిల్యోపనిషత్తులలో మణిపుర చక్రమునకు 12 రేకులున్నవని వ్రాశారు. స్వాధిష్ఠానచక్రము, నాభిప్రక్కగా, పెహంవద్దమన్న

ఈ సుషుమ్నా నాడిలో అంతరతమై ఉన్నదని ప్రాచీనులు సుషుమ్నా నాడి పర్యాయ పదముగా వచ్చే పదాలను అని అన్నారు. సుషుమ్నా నాడి ఊర్ధ్వ మూలం కలిగి అగ్నిలో కలిసి ఉన్నది. దీనికి రెండు వైపుల రెండు నాడులు కలిసి ఉండేటట్లు వ్యాపించి ఉన్నది. భగవద్గీతలో అశ్వత్థవృక్షముగా చెప్పబడినది, ఈ సుషుమ్నా నాడి కిందుగా ఉన్నది. అశ్వత్థవృక్షమనగా సుషుమ్నా నాడియే అని నా అభిప్రాయం. భగవద్గీతలో, ఆదిలో ప్రాయులైన కొన్ని విషయాలు తీసివేసినట్లైతే ఆదిలో గల కొన్ని మూలమైన విషయాలు చెప్పారంటాను. ఇందులో ఊర్ధ్వమూలం, అగ్నిలోను అని సుషుమ్న వర్ణించబడినది. కాని కుండలిని అనే శబ్దం లేదు. కాకపోయినా భగవద్గీత 6 వ అధ్యాయంలో కుండలిని గురించి చెప్పారు ఒక్కొక్కరు, వారి వారి అనుభవముల ప్రకారం అనేక పేర్లతో పిలిచారు. సుషుమ్నా నాడిని ఈ నాడికి కూడా ప్రపంచ బ్రహ్మరంధ్రము, మహాపథము, శ్మశానము, శాంభవి, మధ్యమార్గము, సరస్వతి అని పిలిచారు. ఇది శబ్దస్వరూపిణి, మంత్రస్వరూపిణి, ప్రాణస్వరూపిణి, జ్యోతిస్వరూపిణి. ఇది కదలగానే జ్యోతిర్దర్శనములు కలుగును.

డాక్టర్ రేలే సుషుమ్నా నాడి వేగస్ నర మన్నారు.

## ఇడా పింగళా నాడులు

సుషుమ్నా నాడి తర్వాత ముఖ్యమైన నాడులు ఇడా పింగళా నాడులు. ఇవి వెన్నెముకను ఆశ్రయించి వున్నవి. వెన్నెముకకు కుడివైపున పింగళా నాడి, ఎడమవైపున ఇడానాడి ఉన్నది. కుడిముక్కు నశిరుననది పింగళా నాడి. ఎడమ ముక్కు నశమునది ఇడానాడి. పింగళానాడియందు సూర్యుడున్నాడు. ఈ నాడి ఆయువున్నప్పుడు వేడిచేయును. ఇడానాడియందు చంద్రుడున్నాడు. ఈ నాడి పనిచేసినప్పుడు చల్లదనం చేయును. ఈ రెండు నాడులు కాలమును తెలియచేయును. సుషుమ్నా నాడి కాలమును భ్రమింపును. యోగసాధనం సుషుమ్నా నాడి వశమైనప్పుడు చేసిన సాధనసిద్ధి త్వరగా లభించును. సమాధిలోనివారికి కాలం తెలియదు. నాడులను స్వాధీనం చేసికొన్నవారు, తమ కర్మ ఫలితములను తమ ఇష్టం వచ్చినట్లు త్రిప్పగలరు. యమధర్మరాజును ధిక్కరించిన సిద్ధులున్నారు. ఈ నాడు కూడా కుండలిని సహస్రారం చేరుటకు గ్రంథులను భేదించవలసి వున్నది. మూలాధారమునందు బ్రహ్మగ్రంథి ఉన్నది. మణిపూరము వద్ద విష్ణుగ్రంథి ఉన్నది. విశుద్ధవద్ద రుద్రగ్రంథి వున్నది. మాయాశక్తి ఈ 3 గ్రంథులవద్ద బలంగా వున్నది కాని మణిపూరగ్రంథివద్ద ఎక్కువ బలంగా ఉన్నది. ఈ గ్రంథులను భేదించునప్పుడు భరించరాని బాధ కలుగును. కుంభక ప్రాణాయామంవల్ల గ్రంథిత్రయమును భేదించవచ్చును.

సుషుమ్నా నాడి ఊర్ధ్వమూలం కలది. అనగా దీని మూలం సహస్రార చక్రంలో వున్నది. సహస్రార చక్రమునుగురించి తెలిసికొనుట చాలా ముఖ్యం

## సుధాపింధువు

సహస్రార చక్రము అధోముఖమైవున్నా దాని కర్ణిక ఊర్ధ్వముఖంగా ఉన్నది. ఇక్కడ శ్రీచక్రమున్నది. ఇది ప్రకృతి స్వరూపిణి మహాలక్ష్మి. ఇక్కడ చంద్రమండల మున్నది. దీనిలో గురుపీఠ మున్నది. ఈ గురుపీఠమును, హంసపీఠమని, మణిపీఠమని అంటారు. గురువు, హంస ఇందులో వున్నారు. వీరులు ధ్యానం చేయవలసింది ఈ గురువును. ఇది మణివలె ప్రకాశవంతంగా మెరుస్తూ వుంటుంది. ఈ పీఠముపై గురువు ఆసీనులై, ముక్తినిస్తుంటారు. గురువు పాదాలు అజ్ఞాచక్రంవద్ద నిలబడుతూంటవి. కనుక దానిని అజ్ఞాచక్రమన్నారు. సహస్రారంలో ఉన్న చంద్రమండలమును బిందుస్థానమంటారు. ఇదే సుధాపింధువు. ఇక్కడనుండే అమృతము వర్షించుచుండును. కుండలిని మేల్కొని సహస్రారం చేరి, అందులోని చంద్రుని కాటువేయును. అప్పుడు చంద్రునినుండి అమృతం క్రిందికి ప్రవహించును. అజ్ఞాచక్రం వద్ద ఇంకొక చంద్రుడున్నాడు. పై అమృతం ఈ చంద్రుని తడుపును. ఇక్కడినుండి అమృతము శరీరమంతటిని తడుపును. సహస్రారంలోని చంద్రునికి 16 కలలున్నవి. కలఅనగా పరమాణువు. ఈ 16 కలలలో, 15 కలలు కాలమును తెలుపు తిథులు. మిగిలిన 16 వ కళ, వృద్ధి క్షయం లేనిది విభాగము లేనిది. దీనిని ధ్రువకళ అంటారు. ఇదే అమృతకళ, చిత్కళ, త్రిపురసుందరి. ఇదే వైంద స్థానము. పార్వతీ పరమేశ్వరులు ఐక్యమగు చోటు ఇది. ఇచట విశ్వాత్మతో జీవాత్మ కలియుచోటు, సచ్చిదానందము కలుగుచోటు. వీరులకు ముక్తి కాంతిని పొందుచోటిది. సహస్రారం దగ్గర బ్రహ్మరంధ్రం వున్నది. దీనిని దశమద్వార మంటారు. శరీరంలో బ్రహ్మ ప్రవేశించుచోటిది మూర్ధము, శరీరం నుండి వెడలు చోటూ ఇదే. ఇక్కడ శూన్యసీమ వున్నది. నిర్వికల్ప సమాధి కలుగుచోటు ఇదే. శ్రీ అరవిందులు ఊర్ధ్వమనస్సు Over mind సహస్రార చక్రంలోను, లోమనస్సు Inner mind అజ్ఞాచక్రంలోను ఉన్నదని ప్రాచీనుల సహస్రార చక్రం *Pineal* gland దగ్గర, అజ్ఞాచక్రము Pituitary gland దగ్గర

ఉన్నవి. వీటివల్ల మానవునికి ఆరోగ్యబలములు కలుగుచున్నవని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

కామేశ్వరీ కామబాధల సంయోగానందము నిచ్చునది కనుక, అన్ని రోగములలోను కుండలినీ యోగం దరికి రానీయదు.

## కుండలీ సాధన

కుండలినిని మేల్కొల్పుటకు అనేక సాధనలున్నవి. ఇది నాగుపాము, తేలికైనటువంటిది. తెలిసినవారు లేనియెడల పాము వల్ల ఎంత అపాయమో అట్లే ఇది. గురువుకు దయకలిగినప్పుడు, వారి దృష్టి వల్లగాని, స్పర్శవల్లగాని సిద్ధి కలుగును. ఇట్టి సిద్ధిగల్గినవారు ఇప్పటికీ ఉన్నారు.

శ్రీ రామకృష్ణ పరమహంస వివేకానందునికిట్లే సిద్ధి ప్రసాదించారు.

కుండలినిని చైతన్యవంతం చేయుటకు ముఖ్యంగా నైతికబలం వుండాలి. యమ నియమాలు ముందు సాధించాలి. నైతికశక్తి లేక, కుండలినీ చైతన్యవంతమైనప్పుడు, అది ఆ వ్యక్తిని భ్రష్టుని చేయును. ఆ వ్యక్తి కామక్రోధముల పాలవును. కుండలినీ సాధనకు శరీర, ప్రాణ, నాడీ, మనో, బుద్ధులు శోధించాలి. శరీరశుద్ధికి ఆసనములు కొన్ని సాధించాలి. ప్రాణ, నాడీ శుద్ధులకు ప్రాణాయామం చేయాలి. మనస్సుకు త్రాటకం వగైరాలు చేయాలి. ఆసనముల విషయంలో పతంజలికి, హఠయోగమునకు అభిప్రాయభేదము ఉన్నది. సుఖంగా కూర్చుండుటే ఆసనమని పతంజలి అభిప్రాయం. కుండలినిని మేల్కొల్పుటకే ఆసనములని హఠయోగము చెప్పుచున్నది. ఆసనములలో సిద్ధాసనము శ్రేష్ఠమైనదని అందరి తలంపు. కుండలిని మేల్కొలుపులకు ముఖ్యము, మూలస్థానము పైకి కుంచించుట—సిద్ధాసనంలో ఒక మడిమతో ఈ మూలస్థానమును ఒత్తిపెట్టి రెండో మడిమతో బాహ్యజననేంద్రియముల మర్మస్థానములను ఒత్తిపెట్టవలెను. ఈ స్థానమును కందస్థానమంటారు. నాడులకూడలి ఇది. సిద్ధాసనంలో నాభిని లోనికి లాగిపెట్టి, ముఖ హృదయాన్ని పైకి ఎత్తి, లోనిగాలిని బైటికిపోకుండా బిగపట్టవలెను. లోపల ప్రాణా అపానవాయువుల కలియుక వల్ల అగ్ని పుట్టి కుండలిని మేల్కొంచును. సిద్ధినిచ్చు ఆసనం కనుక సిద్ధాసనమన్నారు. దీనికే ముక్తినిచ్చునది కనుక ముక్తాసనమని, రహస్యంగా వుంచవలసింది కనుక గుప్తాసనమని అన్నారు. జ్ఞానదేవు ఈ ఆసనమునకు గొప్ప ప్రాముఖ్యమిచ్చి దీనికే వజ్రాసనమని అన్నాడు.

కుండలినిని మేల్కొల్పుటకు ముఖ్యమైనది వాయువు. కొందరు అగ్ని, వాయువు, మంత్రము అంటారు. వాయువు శ్రేష్ఠం, గాలిలోని ప్రాణవాయువు అగ్నియే. దాన్నివల్లే అగ్ని పుట్టును. శబ్దమునకు, మంత్రమునకు కూడా వాయువు మూలము.

ఉచ్ఛ్వాస నిశ్వాసాల ప్రేరేపించునది కుండలిని. ఈ ఉచ్ఛ్వాస, నిశ్వాసలతోనే కుండలిని మేల్కొలుపవచ్చును. హంసమంత్రంలోని, హంసబంధంతో గాలిని లోనికి పీల్చి, కుండలినిని గట్టిగా తాకుతున్నట్లు కుంభంతో గాలిని బైటికి వదలుతూ అధోముఖమైన మూలాధారచక్రం ఊర్ధ్వముఖమౌతున్నట్లు భావించాలి. లోపలకు పీల్చినవాయువు కుంభించి, జాలంధర బంధంతో గాలి బైటికి పోకుండునట్లు బంధించాలి. అప్పుడు అది ఎటూ దారి లేక, సుషుమ్నా నాడిలో దారిచేసుకొని ప్రవేశించును. ఇట్లు ప్రవేశించిన వాయువు, మనస్సు సుషుమ్నా నాడిలో లయమగును. ఇదే ముఖ్యమైన మనోలయని ఈ విధంగా కుండలినిని కదిలిచి మేల్కొలిపిన తర్వాత కుండలినిని పైకి తీసుకుపోవుటకు భస్త్రికా ప్రాణాయామం చేయవలెను.

దీనికి ఇంకా అనేకమైన సాధనలున్నవి. మహావేధ, మహాముద్ర, శక్తిచాలనము, వజ్రోలి, కేవల కుంభకము, శాంభవి, త్రాటకం, నేతి, నౌలి, కపాలభాతి, భస్త్రిక, జాలంధర, ఉడ్యాణ, మూలబంధములు మొదలయినవి కూడా ఎక్కువ ఉపయోగించును.

## మంత్రశక్తి

మంత్రముల వల్లకూడా కుండలినిని లేపవచ్చును. మణిపూరచక్రము అగ్నితత్వం కలది. మణి అంటే తేజస్సు కలది కనుకనే ఈ చక్రమును మణిపూరమన్నారు. ఈ చక్రం అగ్నిస్వరూపి కనుక, కొంచెం ఇక్కడ కుండలిని వున్నప్పటికీ అగ్నిస్వరూపిణియైన ఈ చక్రంలోని బీజాక్షరము రం. రం వహ్నిబీజము, రం వహ్ని బీజముగా ప్రపంచంలోని అనేక దేశాలలో, అనేక కాలములలో భావించారు. ఈజిప్టు పూర్వీకుల మంత్రము ర-మక్-హో ఓబ్ అనీ ఇంగ్లీషులో, ర అక్షరము, సూర్యస్వభావం కలదని, పాల్ బ్రంటన్ వ్రాశారు. టిబెటువారు, కొండలమీద కటికచలిలో, రం బీజాక్షరమును జపిస్తూ అగ్ని పుట్టించి, దిగంబరులుగా ఉండకలిగారు. ఇట్టి రం బీజమంత్ర ఉచ్చారణతో అగ్నిని పుట్టించి, కుండలినిని లేవగొట్టవచ్చు.

ఇద్దరికలకూడా కుండలినిని లేపి పైకి తీసుకునిపోవచ్చని లెడ్‌బీటరు వ్రాశారు.

కుండలినిని లేవగొట్టటం తేలికగాని, దానిని పైకి తీసుకునిపోయి, సహస్రారంలో వుంచుట తేలిక కాదు.

# జీవితమాధుర్యం

శ్రీ మల్లాది సత్యనారాయణ

జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ప్రతి మానవుడికి మంచిరోజులు వస్తాయని అప్పుడే జాగ్రత్తగా ఆ మంచిరోజుల్ని సద్వినియోగం చేసుకున్నవాడే నేర్పరి అని అయితే ఆ మంచిరోజులకోసం నిరీక్షణ ఓర్పు చాలా అవసరం అని గోపాలానికి తెలియకపోలేదు. అయితే కాలగర్భంలో కొన్ని సంవత్సరాలు కలిసి పోయి యెప్పుడు చూచినా గొర్రెకు బెత్తెడుతోక అన్నట్లు ఎదుగూ బొదుగూ లేని తన జీవితాన్ని తలచుకుంటూంటే మంచిరోజులు వస్తాయన్న నమ్మకం కాస్తా నశించింది గోపాలానికి. నశించిపోవడమే కాకుండా ఆ మంచిరోజులు అన్నపదం ఎవరినోటి వెంటైనా వినపడ్డప్పుడల్లా ఎవరికి మంచిరోజులు అనే ప్రశ్న వినువెంటనే వెలువడేది కాని ఆ ప్రశ్నకు సమాధానం తనలోపలే అణగిపోయేది

సంవత్సరం పొడుగునా వాన అనక వరద అనక, ఎండనక కొండనక, పురుగనక పుట్ర అనక, రెక్కలు ముక్కలు చేసుకుని పొలం పండించిన వానికి యెంత నిరీక్షించినా మంచిరోజులు రావు భూమిగల ఖామందులకు యెప్పుడూ మంచిరోజులే వస్తూంటాయి పగలు పన్నెండుగంటలూ రక్తం ధారపోసే మిల్లులో పనిచేసే కార్మికుడు ఎంత నిరీక్షించినా యెంత ఓర్పు వహించినా మంచిరోజులు రావు. మిల్లు యజమానికి మూడువందల అరవై నాలుగురోజులూ మంచిరోజులే

కష్టపడే లోకం అనుభవించేది యింతేకదు అనే సిద్ధాంతం వేళ్ళుపాతుకు పోయిన మనదేశంలో అందరికీ మంచిరోజులు యెప్పుడూరావు కొందరికే వస్తూంటాయి అందుచే గోపాలానికి ఆ మంచిరోజులు అన్నమాట వింటే హేళనగా వుంటుంది.

సాహుకారు వెంకటసుబ్బయ్య యిచ్చిన ఆర్డరు ప్రకారం పగాకు కొనడానికి తెల్లవారుఝామునుండే బయలుదేరి నిమిత్తం సాహుకారిచ్చిన యెనిమిదివందల రూపాయలు జాగ్రత్తగా జాకెట్ సంచిలో భద్రపరచి నడుం చుట్టూ కట్టుకొని బయలుదేరి యింటికి వస్తున్న గోపాలానికి ప్రొద్దుటినుంచి తిండిలేనందున కళ్ళుతిరుగు తున్నాయి తన తిండిమాట దేవుడెరుగు. చంటిపిల్లకి ప్రొద్దుటినుంచి పాలులేవు పాలడబ్బా ఖాళీ అయి పోయింది. ఈ సాయంత్రం పాలడబ్బా కొనుక్కోకపోతే యీ రాత్రి పిల్లని పట్టుకోగలరా? పాల డబ్బామాట తలపుకు వచ్చేసరికి గుండె గుభేలుమంది. ఏం పెట్టికొంటాను పాలడబ్బా నెలాఖరు అయి ఒక టవ తేదీ వస్తే కాని సాహుకారు వెంకటసుబ్బయ్య జీతం యివ్వడు ఇవ్వడు అంటే సాహుకారు కేమీ తప్పులేదు. ఎందుచేతనంటే గోపాలం సాహుకారు చుటూ పని యిస్తుందని తిరిగివస్తూనే సాహుకారు వెంకటసుబ్బయ్య కొన్ని షరతులు జాగ్రత్తగా లిఖించి గోపాలంచేత సంతకం చేయించుకున్నాడు. అప్పటికి ఆమోదించి ప్రవేశించాడు గోపాలం

నెలలో మధ్యగా యెప్పుడూ జీతం కోరాదు డబ్బులో కొంతకూడా అడగడానికి వీలులేదు నెలా పూర్తి అయ్యాక ఒకటవ తేదిని పూర్తిగా జీతం యిచ్చే వరకు మొదటిది

ఇక రెండవది గుమాస్తా సంఘాలలో చేరడం గాని సమ్మెలలో పాల్గొనడంగాని యెంతమాత్రం కూడదు

మూడవది ఇష్టం లేకపోతే పనిమానివేయడం తప్ప జీతం పెంచమని యెప్పుడూ అడగకూడదు

నాల్గవది లేబరు రూల్సు అంటూ ఆదివా రాలు పనిమానడానికి వీలులేదు ఎంత అర్జంటవసరమైన పని అయినా సాహుకారు పర్మిషను తీసికొనవిదే మాన డానికి వీలులేదు.

అయిదవది పని యేమాత్రం తృప్తికరంగా లేక పోయినా గోపాలాన్ని పనిలోనుంచి తప్పించవచ్చు దానికి నోటీసులతో నిమిత్తం లేకుండా పూర్తిహక్కులు సాహుకారుకున్నాయి.

ఆరవది నెల జీతం అరవై రూపాయలు అయినప్పటికీ సాహుకారు అంకెలు యెంత యెక్కు వగా వేసి సంతకం పెట్టమన్నా గోపాలం సంతకం పెట్టి తీరాలి.

ఇన్ని షరతుల కంగీకరించి ఉద్యోగంలో ప్రవేశించిన గోపాలం యీరోజు యింట్లో బియ్యంలేక పస్తుపడుకోవల్సి వచ్చినా చంటిపిల్లకు పాలసీసా లేకపోయినా సాహుకారుని యేమని అడుగుతాడు? కనీసం చెప్పడంకూడా తన అసమర్థతను సూచిస్తుందని చెప్పలేదు.

"ఛీ! అల్లాంటి స్వరం ఏం బాగుంటుంది దాని మీదనుంచి పడిపోతే దెబ్బ తగులుతుందమ్మా" అంది.

"ఎందుకు తగులుతుంది."

"ఆ స్వరం పగలగొట్టేస్తుంది"

"ఎందుకు పగలగొడుతుంది? మరి వాళ్ళపాటని పగలగొట్టదేం"

"దానికి కోపం వచ్చినప్పుడు పడగొడుతుంది"

"ఎప్పుడొస్తుంది కోపం?"

"ఎప్పుడో వస్తుంది ఇంకా కావలిస్తే నాన్నగారిని అడుగు" అంది భర్తని బాధాసముద్రంలోంచి కాస్త తేల్చాలని

"ఏమండి నాన్నగారూ! ఉల్లికి కోపం వొచ్చి పగలగొడుతుందా?" అంది బృంద, కూర్చున్న తండ్రి ఒళ్ళోకెక్కి చొక్కా గుండీలు విప్పుతూ

"అవునమ్మా" అన్నాడు గోపాలం మధురా మాదిరిగా సద్ది చెప్పేవిధానం తెలుసుకు తోచలేదను కున్నాడు

"అయితే నాన్నగారూ! వీణవల్లం మనకొద్దు" అంది బృంద బుంగమూతి పెట్టి తండ్రితో

జాలేసేసింది గోపాలానికి నవ్వూ వచ్చింది తన అసమర్థతకు.

పిల్లల కోర్కెలు తీర్చలేనివాళ్లు ఎందుకు కనాలి కని వాళ్ళ ఆశల్ని సమూలంగా నాశనంచేసి వారి పురోభివృద్ధి ఎలా అరికడుతున్నారో యివాళ అర్థమైంది గోపాలానికి. తనకి పాఠం నేర్పిన బృందను ఒక్క ముద్దు పెట్టుకున్నాడు.

మరి యీ ముద్దో అని రెండోబుగ్గ చూపించింది బృంద ఆనందంతో ముగ్ధుడయి రెండో ముద్దు కూడా పెట్టుకున్నాడు

కొంతకాలం జరిగిపోయింది

"సుగుణా! కొన్ని మంచినీళ్ళు అందు కుంటావా?"

"కొంచెం మజ్జిగ దాహం తాగరాదూ ఉప్పువేసి యిస్తాను"

"మరి నువ్వుకూడా తాగవేం? ఇవ్వాళటికి ఇద్దరం చెరో కాస్త ఆ మజ్జిగ తాగి పడుకోవలసిందే. క్రిందటి జన్మలో ఎవరినోటిముందు అన్నం లాగేశాం ఈ జన్మలో తిండికి మొహంవాచాము" అన్నాడు కన్నీళ్ళతో గోపాలం.

'అదేమిటండీ ఇంతమాత్రానికే మీరే కంట తడిపెడితే నేనేమైపోవాలి చెప్పండి మనమాటకేం పాపం పాపకి ప్రొద్దుటినుంచీ పాలు లేవు"

"అవును కనడమాత్రం కన్నాము. ఒక్కదానికి పాలు పొయ్యలేకపోతున్నాం మనలాంటి గర్భదరిద్రులు కడుపులు ఎండగట్టాలి మరి బృందనేలా ఊరుకోబెట్టావు"

"చిన్నతపేలా గిద్దెడుబియ్యం మిగిలాయి అవి వండి దానిముందుకు పెట్టాను"

"మంచిపని చేశావు పాపకి పాలు లేవు."

"పాపం ఆ ఎదురింటివారి లక్ష్మి ఈ సాయంత్రం వచ్చింది. ఏవోమాటల సందర్భంలో పాలడబ్బా అయిపోయింది తేవాలి అనిచెబితే పాపం వాళ్ళ పాల డబ్బాలో పాలుకలిపి పట్టుకువచ్చి యిచ్చింది యిప్పుడే"

"మరి పట్టించావా"

"ఏది? అదిగో వెళ్లింది మీరూ వచ్చారని మీకు మజ్జిగయిచ్చి పాపకి పాలు పట్టిస్తాను అని తొందరగా నే వంటయింట్లోకి వెళ్లిపోయింది.

'సుగుణా' అన్నాడు కన్నీళ్ళతో గోపాలం

'ఏమండీ' అని దగ్గరకు వచ్చింది చూచింది "ఏమిటండీ అది చిన్నపిల్లాడిలా" అని కళ్లనీళ్లు తుడుచు కుంది

"ఇంత అసమర్థుడైన భర్తను కట్టుకుని ఏం సుఖ పడుతున్నావు సుగుణా"

"అబ్బ! ఏంమాటలండీ అవి.

"పాపకికూడా గతిలేని కాపరం ఎందుకొచ్చిన కాపరంరా అనుకుంటోందికదూ నీ మనస్సు సుగుణా"

ఆ మాట బాణంలా గుచ్చుకుంది సుగుణ హృదయానికి, తీక్షణంగా చూచింది భర్తవంక "మీకు బ్రతికుండడం మీ కిష్టంలేదా!" అంది బాధగా.

"లేదులే సుగుణా వెళ్ళి మజ్జిగ పట్టుకురా. చెరో గుక్కెడు తాగుదాం"

"ఇంకెప్పుడు అలాంటి మాటలనని ప్రమాణం చెయ్యండి."

"లేదులే సుగుణా. వెళ్ళి మజ్జిగ తీసుకురా."

# కలగూరగంప

## ఆచార్య శిశిరకుమార్ మిత్ర

శ్రీ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి



యిటీవల బ్రిటిష్ రాయల్ సొసైటీవారు యిద్దరు ప్రముఖ భారతీయ భౌతిక శాస్త్రవేత్తలను సభ్యులుగా ఎన్నుకొనిరి. వీరిలో ఒకరు ఆచార్య ఎస్. ఎన్. బోస్. వీరు చాలకాలము కలకత్తా విశ్వవిద్యాలయము ఆచార్యులుగానుండి, ప్రస్తుతము విశ్వభారతి శాంతినికేతనమునకు ఉపాధ్యక్షులుగానున్నారు. రెండవవారు ఆచార్య శిశిర కుమార్ మిత్ర.

శ్రీ శిశిర్ కుమార్ మిత్ర కలకత్తాలో 1890 లో జన్మించిరి. భగల్పూర్ కళాశాలయందును, కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలోను విద్య నభ్యసించిరి. 1919 లో కలకత్తా విశ్వవిద్యాలయమువారు వీరికి D Sc. పట్టము నొసగిరి. ఆ సంవత్సరములోనే వీరు పారిస్ విశ్వవిద్యాలయమునకేగి 1923 లో స్వదేశమునకు తిరిగివచ్చిరి. వెంటనే కలకత్తా విశ్వవిద్యాలయములో భౌతిక శాస్త్రశాఖలో ఖైరా ప్రొఫెసర్ గా నియమింపబడిరి.

నిస్తంత్రి ప్రసారము (వైర్లెస్ కమ్యూనికేషన్స్) రంగములో ముందు ముందు ఎంతయో అభివృద్ధి పొందగలదని ఆచార్య మిత్ర ఆ రోజులలోనే గ్రహించి, వైర్ లెస్ శాస్త్రమును పెద్ద తరగతులలో బోధించుట మొదలిడిరి. అంతేకాక వారు ఆ శాస్త్రములో పరిశోధనలు కూడ మొదలిడిరి. 1935 లో వారు సర్ రాష్ బిహారీఘోష్ ప్రొఫెసర్ గా నియమింపబడి, సదరు 1955 లో రిటైర్ అగునంతవరకు ఆ పదవి యందే యుండిరి.

భారత ప్రభుత్వమునకు చెందిన కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ యిండస్ట్రియల్ రిసర్చి వారిచే రేడియో పరిశోధన సంఘమును స్థాపింపజేయుటకు ఆచార్య మిత్ర కారకులు. ఈ సంఘటనమునకు ప్రప్రథమ అధ్యక్షులుగా వీరు 1943-48లో పనిచేసిరి. వీరి నాయకత్వమున కలకత్తా విశ్వవిద్యాలయములో 1949 లో రేడియో ఫిజిక్స్ అండ్ ఎలక్ట్రానిక్స్ శాఖ నెలకొల్పబడెను.

ఆచార్య మిత్ర మనదేశములో రేడియోకు సంబంధించిన పరిశోధనలలో అగ్రగణ్యులు. వారు యువకులకు, తమ శిష్యులకు ప్రోత్సాహము నిచ్చి సహాయము చేయుటలో ఉదారబుద్ధి కలవారు.

వీరు Upper Atmosphere అను గ్రంథమును రచించిరి. ఈ విషయమును గురించిన గ్రంథము యిది యొక్కటే యగుటయే గాక అనేక అంశములలో యిది స్వతంత్ర రచనగా ప్రపంచ ఖ్యాతినొందినది. యిటీవల దీనిని రష్యన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు రష్యను భాషలోకి తర్జుమా చేయించి ప్రచురించిరి.

ఆచార్య మిత్ర 1955 లో భారత విజ్ఞాన పరిషత్తు (Indian Science congress) నకు అధ్యక్షత వహించిరి. భారత విజ్ఞాన వార్తాసంఘమునకు కూడా అధ్యక్షులు. ఈ సంఘమువారు "విజ్ఞానము-సంస్కృతి" (Science and Culture) అను యింగ్లీషు మాసపత్రికను ప్రచురించుచున్నారు. అంతర్జాతీయ జియోఫిజికల్ ఇయర్ కాలాన భారత జాతీయసంఘమునకు ఆచార్య మిత్ర సభ్యులు. అనేక భారతీయ, విదేశీయ వైజ్ఞానిక పత్రికాసంపాదక వర్గములలో సభ్యులు. మన దేశములో యిటువంటి ప్రఖ్యాతిగాంచిన శాస్త్రజ్ఞులుండుట మనందరికి గర్వకారణము.

